31.12.1993 శుక్రవారం, 14 పేజీలు, సంపుటి: 64, సంచిక: 53, విడిప్రతి: రు. 2.00 లు
Regd. No. HNL. 18

# జమీన్ రైతు

జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి, స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు



### నిప్పులేనిదే పొగరాదు ; కాని ఆ నిప్పెక్కడ పుట్టిందో అర్థం కావడం లేదు!

# నాలుగో కృష్ణుడు తెరపైకి వస్తాడా?

రాష్ట్ర రాజకీయ వాతావరణం వున్నట్లుండి వేడెక్కింది. కారణం తెలియకుండా సంక్షుభిత మైంది. ముఖ్యమంత్రి విజయ భాస్కర రెడ్డిని మార్చనున్నారన్న పుకారు భాగ్యనగరంలో రేస్ కారు కంటే స్పీడుగా షికారు చేస్తున్నది. ఎటూ కాని సమయంలో నాయకత్వం మార్పు అన్న వదంతి లేవడం విచిత్రం. ఎవరో పుకారు పోకకు దీన్ని సృష్టించి

## వెంకటస్వామిని రంగంలోకి తెచ్చే యత్నం

వుండాలి. కాలక్షేపం కోసం అదుగో పులి అని కేక పెట్టి, వినోదించే వారు రాజధానిలో చాలా మందే వున్నారు. అటువంటి హాశక్కి వార్తే అయితే విజయభాస్కర రెడ్డి సీరియస్‌గా తీసుకోవాల్సిన అవసరం లేదు. నవ్వేసి సరిపెట్టుకోవచ్చు. కాని ఆయన శిబిరంలో ఆ తేలిక భావం లేదు. అందరి ముఖాలూ వాడిపోయి వున్నాయి; అనుమానం, సందేహం వారిని పీడిస్తున్నాయి. సాక్షాత్తు సిఎం మూడ్ కూడా ఆఫ్ అయిపోయి వుంది. రెండు రోజుల నుంచి ఆయన వచ్చిన వారితో ముభావంగా, ముక్తసరిగా మాట్లాడి పంపేస్తున్నారు వైరాగ్యం ప్రదర్శిస్తున్నారు. జిల్లా వారీ శాసన సభ్యుల సమావేశాలు కూడా మొదట

## సియం మూడ్స్ ఆఫ్!

జరిగినంత ఉత్సాహంగా లేవు. లాంఛన ప్రాయమై పోయాయి.

రాష్ట్ర రాజకీయ నాటక రంగం పై విజయభాస్కర రెడ్డి అప్పటికే మూడవ కృష్ణుడి క్రింద లెక్క; ఆయన్ను గ్రీన్ రూమ్‌కు పంపి నాలుగవ కృష్ణుణ్ని తెర ఎక్కించే




సాహసం ఎవరు చేస్తారు? ఎందుకు చేస్తారు? చేయాల్సిన అగత్యమేమి వుంది? ఏడాదిలో ఎన్నికలు పెట్టుకొని నాయకత్వం మార్పు ప్రతిపాదన అధిష్టాన వర్గమైనా చేస్తుందా? అది పార్టీకి ఆత్మహత్యా సదృశం కాదా? ప్రజలలో నవ్వుల పాలై పోదా? పివి నరసింహా రావు అంత మూర్ఖంగా వ్యవహరిస్తాడా? నమ్మను కాక నమ్మలేము. అయితే నిప్పులేనిదే పొగ రాదు కదా అన్నది ఆలోచన. ఈ నిప్పెక్కడ పుట్టిందో తెలిస్తే ఆ పొగ ఎంత వరకు నిజమైందో చెప్పవచ్చు. అది ఢిల్లీ నుంచి వచ్చిందా లేక పనీ బాటా లేని మంత్రి పదవులు రాని నిరాశోపహతుల అసూయోద్విగ్న మానసాలలో పుట్టిందా అన్నది తేలాలి.

ఈ నిజానిజాలు తేలక ముందే కొత్త పెళ్లి కొడుకులు భాషికాలు కట్టుకొని, ధోవతీలు సవరించుకొని ముందుకు వస్తున్నారు. కేంద్ర మంత్రి శ్రీ జి. వెంకటస్వామి వీరిలో ఒకరు. వరుసగా ముగ్గురు అగ్ర కులాల వారు పెత్తనం చేసిన తర్వాత మరొక రెడ్డినే, కమ్మనే గద్దె ఎక్కిస్తే రాష్ట్రంలో అలజడి రేగుతుందని; బహుజన సమాజ్ పార్టీ శరవేగంగా ప్రజలలోకి దూసుకొని వస్తున్న ఈ సందర్భంలో



పార్టీ నాయకత్వం బలహీన వర్గాలకు అప్పచెప్పక తప్పదని ఒక వర్గం వారు చాలా కాలం నుంచి వాదిస్తున్నారు. అయితే వెనుకబడిన తరగతులలో అంతటి సమర్థత, స్థాయి వుండే వారు కన్పడడం లేదు కాబట్టి, హరిజన

కొరవ 12 పేజీలో

# పంచాయితీ ఎన్నికలకు ఎమ్మెల్యేల పంతం!

అసెంబ్లీ ఎన్నికలలోగా రాష్ట్రంలో పంచాయితీ ఎన్నికలు జరిపించాలని మెజారిటీ ఎమ్మెల్యేలు ముఖ్యమంత్రి పై వత్తిడి తెస్తున్నారు. మొన్నటి శాసన సభా సమావేశాలలో పంచాయితీల సవరణ బిల్లు ఆమోదమైంది. తమ చేయి దాటి పోకుండా వుండడానికి ప్రతి పంచాయితీలో ఇద్దరు సభ్యుల నామినేషన్ సౌకర్యం , కల్పించుకున్నారు. ఇప్పుడు గనుక ఎన్నికలు పెడితే, అత్యధిక సంఖ్య సర్పంచ్‌లు పాలక వర్గం వారే అవుతారు. అసెంబ్లీ ఎన్నికలకు అది పెద్దఊపు నిస్తుంది. గ్రామ గ్రామంలో సమర్థవంతమైన యంత్రాంగం ఏర్పడి, పార్టీకి మేలు చేస్తుంది. అందువల్లే ఎమ్మెల్యేలు ఈ ఎన్నికల పట్ల అంత ఆసక్తి చూపుతున్నారు.

తెలుగుదేశం ప్రభంజనం వీస్తున్నదన్న వాతావరణంలో పంచాయితీలు పెద్ద అవకాశమని, ఆ ఎన్నికలు జరిపించకుంటే అసెంబ్లీ ఎన్నికలకు కాంగ్రెస్‌కు గ్రామాలలో

కొరవ 12 పేజీలో



# వి.ఆర్. కాలేజిలో సైన్స్ సెంటర్- జోక్ కాదు, నిజమే!

విఆర్ కాలేజిలో సైన్స్ సెంటర్ ప్రారంభోత్సవ మంటే వినేవారెవరికైనా ఏప్రెల్ ఫస్ట్ అప్పుడే వచ్చేసిందా అనే అనుమానం కలుగుతుంది. అసలు క్లాసులు జరగడమే కనాకష్టమైన ఆ చదువుల కార్ఖానాలో సైన్సు సెంటర్లు, ఆర్ట్ ఫోరంలు పుడతాయంటే ఆశ్చర్యమే కదా? బురద గుంటలో కలువ పువ్వు పూసినట్లు విఆర్ కాలేజిలో నిజంగానే సైన్సు సెంటర్ ప్రారంభమైంది. ఆనం వివేకానంద రెడ్డి కాలేజి పెత్తనం స్వీకరించిన తర్వాత వస్తున్న మంచి మార్పులలో ఇదీ ఒకటి! 25తేది ఉదయం డాక్టర్ బిఆర్ అంబేద్కర్ విశ్వవిద్యాలయం ప్రొఫెసర్ శ్రీ ఎస్. బ్రహ్మాజీ రావు జ్యోతి వెలిగించి ప్రారంభోత్సవ లాంఛనం జరిపించారు. సెంటర్‌కు ఇంకా ఒక ప్రత్యేక గది, వసతులు సమకూరలేదు కాని, కొండవీటి చేంతాడంత కమిటీ ఏర్పడింది. సెంటర్ లక్ష్యాలు చాలా బాగున్నాయి. విద్యార్థులలో శోధనా స్ఫూర్తి, శాస్త్ర స్పృహ, క్రియాత్మక, అన్వేషణాత్మక, వినూత్న ఆలోచనా ధోరణులు పెంపొందింప జేయడం; గ్రామాలను దత్తత తీసుకొని క్లాసుల్లో సముపార్జించిన శాస్త్ర పరిజ్ఞానాన్ని ఆచరణలో ప్రయోగించడం, సైన్స్ మ్యూజియం నెలకొల్పడం, సైన్స్ రీసెర్చ్ ప్రాజెక్టులు చేపట్టడం వంటివి ఈ సెంటర్ తనకు తాను నిర్దేశించుకున్న లక్ష్యాలు. పెరటి చెట్టు మందుకు

> సభలో అమెరికా నెల్లూరీయుడి తిట్లు - తిరుగు చీవాట్లు!

పనికి రాదన్నట్లు, ప్రజ్ఞాధురీణుడైన శాస్త్రవేత్తగా ప్రపంచమంతా ప్రాచుర్యం పొంది కూడా, విఆర్ కాలేజి ప్రాంగణంలో మాత్రం వట్టి ఫిజిక్స్ లెక్చరర్‌గా, గుర్తింపు లేకుండా మరుగున పడి పోయి వుండిన డాక్టర్ ఎ. జగదీశ్ ఈ సెంటర్‌కు సూత్రధారి, పాత్రధారి కూడా! జగదీశ్ కల్గాం చేత పట్టారు కాబట్టి ఈ సెంటర్ నాలుగు కాలాలు నడుస్తుందన్న నమ్మకం కల్గుతూంది.

ప్రారంభోత్సవ సభలో డాక్టర్ బ్రహ్మాజీ రావు గారు చక్కటి ప్రసంగం చేశారు. సమాచారం సేకరించి, విశ్లేషించి, అందులోని ప్రధాన కామన్ ఫ్యాక్టర్‌ను కనుగొని, అభివృద్ధి చేసి, ప్రామాణికాలతో దాన్ని స్థిరీకరించడ మొక్కటే సైన్సు కాదు; సైన్సు అనేది ఈ పనులన్నీ చేసే విధాన క్రమంతో సంపర్కం కల్గి వుండాలి. దురదృష్టవశాత్తు సమకాలీన విద్యార్థులు విమానాల్లో వుండే బ్లాక్ బాక్స్‌ల వలె తయారయ్యారు. అయ్యవార్లు చెప్పే విషయం తమలో నిక్షిప్తం చేసుకొని, పరీక్ష పేపరు పై వెలిగ్రక్కడమే విద్యార్జనగా పరిగణ పొతున్నది. విద్యార్థులలోని సృజనాత్మక స్వభావాన్ని స్పృశించి, మెరుగు పరచినప్పుడే నిజమైన లక్ష్య సిద్ధి కల్గుతుంది అన్నారాయన.

కాలేజి కరస్పాండెంట్ శ్రీ ఆనం వివేకానంద రెడ్డి విఆర్ కాలేజి పాత విద్యార్థులు ప్రపంచ మంతా వ్యాపించి, శాస్త్రసాంకేతిక రంగాలలో విశేష ప్రాముఖ్యత పొంది వున్నారని చెప్పా, త్వరలో కాలేజిలో రాష్ట్ర స్థాయి సైన్స్ ఫేర్ నిర్వహిస్తామని ప్రకటించారు. ప్రిన్సిపల్ శ్రీ డి. గోపాల కృష్ణమూర్తి మాట్లాడారు. కాలేజి కమిటీ అధ్యక్షుడు శ్రీ తూపిలి సుందర రామరెడ్డి సైన్స్ క్విజ్‌లో గెలుపొందిన విద్యార్థులకు బహుమతులు పంచారు. సెంటర్ కార్యదర్శి శ్రీ వేణునాథన్ వందన సమర్పణ చేశారు.

* * *

ఈ ప్రారంభోత్సవ రామాయణంలో ఒక పిడకల వేట కూడా వుంది. అమెరికాలోని డెట్రాయిట్‌లో కంప్యూటర్ నిపుణుడుగా పనిజేస్తున్న ప్రొఫెసర్ రామచంద్రరావు అనే అమెరికా ఆంధ్రుడు ఆరోజా ఇంట్లో పొద్దుపోక ఆ సభకు వచ్చారు. ఆయన వి.ఆర్. కాలేజి పాత విద్యార్థి. అసమాన ప్రతిభను సంపాదించుకొని, ఉన్నతికి వచ్చి, అమెరికాలోనే స్థిరపడి పోయారు. ఆయన తండ్రి నెల్లూరులో ఎండోమెంట్స్ ఇన్స్‌పెక్టర్‌గా పనిచేసేవాడట. మధ్య తరగతి కుటుంబ ఆర్థిక బాధలన్నీ అనుభవించిన వాడుగా వున్నట్లున్నారు; చదువుకు చాలినంత వసతి లేక తంటాలు పడిన గత జీవిత కఠిన వాస్తవాలు ఆయన్ను అమెరికాలో వున్నప్పటికీ వెన్నాడుతూనే వున్నట్లున్నాయి. అవన్నీ ఆయనకు ఈ దేశంపైన, ఈ దేశంలోని పరిస్థితులపైన క్రోధాన్ని, కసిని కల్గించినట్లున్నాయి. శ్రీ తూపిలి సుందర రామిరెడ్డిగారు సభలో మాట్లాడుతూ డబ్బు సంపాదన కోసం అమెరికాలో, ఇంగ్లండ్‌లో స్థిరపడిపోయిన మేధావులు, శాస్త్ర వేత్తలూ తమ విజ్ఞానాన్ని మన దేశానికి కొంత పంచి పెట్టాలని కోరారు. అది

కొరవ 10 పేజీలో

సైన్స్ సెంటర్ ప్రారంభోత్సవ సభలో ప్రిన్సిపల్ డి. గోపాలకృష్ణమూర్తి, తూపిలి సుందర రామ రెడ్డి, వేణునాథన్, ప్రొఫెసర్ బ్రహ్మాజీ రావు, ఆనం వివేకానంద రెడ్డి

# మనో మోహనుడు

జాయింట్ పార్లమెంటరీ కమిటీ నివేదికలో తనకు తలవాచే చీవాట్లు పెట్టినందుకు అలిగి ఆర్థిక మంత్రి మన్మోహన్ సింగ్ పదవికి రాజీనామా చేశారు. అలవాటు ప్రకారం ప్రధాని శ్రీ పి.వి. నరసింహ రావు ఆ పత్రాన్ని తన టేబుల్ సొరుగులో వేసుకొని, దేశాన్ని సస్పెన్స్‌లో పెట్టి, చర్చించక దాచిపెదన్నట్లు వదిలేశారు. దాన్ని ఆమోదించనూ లేదు, తిరస్కరించనూ లేదు; ఏమి చేయబోయేదీ చెప్పడం లేదు.

ఒక్కొక్కసారి నాన్చుడు వైఖరి కూడా మంచే చేస్తుంది. ప్రధాని ఎటూ తేల్చక పోవడంతో రాజీనామా విషయమై దేశం లోపల, వెలుపల కూడా విస్తృతమైన చర్చలు జరుగుతున్నాయి. ఒక మంత్రి రాజీనామా విషయం - అదీ పార్లమెంటరీ దర్యాప్తు కమిటీ నిర్బాధ్యతతో వ్యవహరించాడని నిందవేసిన మంత్రి విషయంలో ఇంత చర్చ, వాదోపవాదాలు జరగడం అపూర్వం. రెండేళ్ల స్వల్ప కాలంలో మన్మోహన్ సింగ్ దేశ ప్రజల నెట్లా సమ్మోహన పరిచాడో దీన్ని బట్టి అర్థం చేసుకోవచ్చు.

ఎనిమిది వేల కోట్ల రూపాయల ప్రజాధనం స్వాహా అయిన భయంకరమైన ఆర్థిక నేరంలో మన్మోహన్ సింగ్‌కు ప్రత్యక్ష ప్రమేయం లేదు. ఆయన నిజాయితీని ఎవరూ ప్రశ్నించలేదు; ప్రశ్నించలేరు కూడా. అయితే ఈ దోపిడీని పసిగట్టి, నివారించ వలసిన పదవిలో వుండి కూడా, ఆ బాధ్యతను విస్మరించా రాయన. పైపెచ్చు, దోపిడీ ఫలితంగా పెరుగుతున్న షేర్ల ధరలు తాను ప్రవేశ పెట్టిన నూతన ఆర్థిక విధానాల సత్ఫలితాలని ప్రకటించారు. దీనివల్ల మరింత మంది అమాయక ఇన్వెస్టర్లు షేర్ల సాలెగూడులో చిక్కుక పోయారు. అసహజ పరిస్థితులలో షేర్ మార్కెట్ బెలూన్ వలె ఉబ్బి పోతుండడం గమనించ లేక పోవడం, అది బద్దలైన తర్వాత కూడా దోషులను గుర్తించలేక పోవడం, దోషులతో చేయి కల్పినట్లు సందేహం వున్న రిజర్వ్ బ్యాంక్ మాజీ గవర్నర్ వెంకటి రమణన్ వంటి వారు నిష్కళంకులని కితాబు ఇవ్వడం మన్మోహన్ సింగ్ చేసిన తప్పులు. అందువల్ల జెపిసి ఆయనకు చీవాట్లు వేసింది. ప్రజాస్వామ్య సాంప్రదాయాలు పాటించే వారెవరైనా ఆ వ్యాఖ్యలకు పదవీ పరిత్యాగం చేయడం ధర్మం. ఎన్టీఆర్ వంటి దళసరి చర్మపు రాజకీయ వాదులు వెలుగులోకి వచ్చి, ఇదేదో పెద్ద త్యాగంగా కన్పిస్తున్నది కాని గతంలో నీలం సంజీవ రెడ్డి, లాల్ బహదూర్ శాస్త్రి వంటి వారు రాజీనామాలు చేసిన సందర్భాలు గుర్తుకు తెచ్చుకుంటె ఇందులో విశేషమేదీ కన్పించదు; పై పెచ్చు రాజీనామా తప్పని సరి అన్పిస్తుంది.

అయితే దివాలా స్థితిలో, అప్పుల ఊబిలో కూరుక పోతుండిన దేశ ఆర్థిక వ్యవస్థను వెలికి లాగి, ఉజ్వలమైన భవిష్యత్‌కు బాటలు వేసిన మన్మోహన్ సింగ్‌ను వదులుకునే పరిస్థితిలో దేశం వున్నదా అన్నది సమస్య. అప్పులు కట్టడానికి లండన్ బ్యాంకులో బంగారు కుదువ పెట్టే హీన స్థితిలో, ఆయన ఆర్థిక శాఖ కళ్లెం చేత పట్టారు. రెండేళ్ల స్వల్ప వ్యవధిలో 20 వేల కోట్ల రూపాయల విలువైన అమెరికన్ డాలర్లు బ్యాంకు బ్యాలన్స్‌గా కల్గిన స్థితికి మెరుగు పరిచారు. దరిద్రపు దేశమనే తూస్కార భావంతో ఢిల్లీ వైపు ముఖం త్రిప్పడానికి కూడా ఇష్టపడని విదేశీ కంపెనీలు, ప్రవాస భారతీయులు వేలాది కోట్ల డాలర్ల సంచులు చేత పట్టుకొని భారతదేశంలో పరిశ్రమలు స్థాపించ డానికి పరుగెత్తుకొని వచ్చే వాతా వరణం సృష్టించారు. ఆయన ప్రవేశ పెట్టిన సరళీ కృత ఆర్థిక విధానాలు మరొక ఐదారేళ్ల పాటు ఇట్నే కొనసాగితే ప్రపంచంలో బలవత్తరమైన పారిశ్రామిక దేశంగా ఇండియా తలెత్తుకొని తిరిగే అవకాశం కల్గుతుంది. కర్తవ్య దీక్ష, చిత్తశుద్ధి, నిష్కళంక మానసాలతో దేశ ప్రగతి కోసం కృషి చేస్తున్న ఒక మహిమాన్విత ప్రజ్ఞాధురీణుడ్ని స్వల్ప తప్పిదం కోసం జారవిడుచుకొంటె, ఆర్థిక వ్యవస్థే నష్టపోయే ప్రమాదం వుంది. అందువల్లే దేశం లోపల, వెలుపల్ల వున్న అసంఖ్యాకమైన పారిశ్రామిక వేత్తలు రాజీనామా ఉపసంహరించు కోవాలని ఆయన్ను వత్తిడి చేస్తున్నారు. ప్రోటోకాల్‌కు విరుద్ధంగా బ్రిటిషు రాయబారి సైతం ఈ సలహా ఇచ్చారు. ఇన్ని వర్గాల ప్రజలలో అభిమానాన్ని, విశ్వాసాన్ని చూరగొన్న మన్మోహన్ సింగ్ జన్మ ధన్యమైంది.

జమీన్‌రైతు

అయితే 85 కోట్ల ప్రజానీకానికి సంబంధించిన ఆర్థిక వ్యవస్థ ఒక వ్యక్తి లేనందు వల్ల దారి తప్పుతుందా? పతనమౌతుందా? సరళీకృత ఆర్థిక విధానాన్ని కొన సాగించ గల అటువంటి మేధావి, సమర్థుడు దేశంలో మరొకరు లేరా? మన్మోహన్ సింగ్ వంటి వ్యక్తులు దేశానికి అవసరమే కాని, వారు లేకుంటే దేశం దివాలా తీస్తుందన్న అభిప్రాయం సరైనది కాదు; ఏ దేశ అభివృద్ధికైనా కావలసింది వ్యక్తులు కాదు, వ్యవస్థ! ఎవరు వున్నా, ఎవరు లేకున్నా తనంతట తాను నడిచి పోయే వ్యవస్థను నెలకొల్పుకో గల్గితేనే భవిష్యత్తు; కేవలం వ్యక్తులతో ముడిపడితే ఆ ఫలితాలు తాత్కాలిక మౌతాయి.

## హేతువాదులు చేయని పని జమీన్‌రైతు చేసింది!

పుట్టపర్తి సాయిబాబా మాయ లీలలకు సంబంధించి ఏ హేతువాదీ బహిర్గతం చేయని విషయాలను ప్రపంచానికి 'జమీన్‌రైతు' వెల్లడి చేస్తున్నందుకు ఆనందంగా వుంది. వాస్తవాలను గ్రహించలేని వారిని మూర్ఖులన వచ్చు. పత్రిక అభిమానిగా ఇటీవల వస్తున్న సంచలన వార్తల విషయమై వివరాలెందుకని హెచ్చరించాలను కొన్నాను. కాని ఎంతో ధైర్య సాహసాలతో నిర్భీతిగా ముందుకు సాగుతూ అవినీతిని బట్టబయలు చేస్తున్న మీకు అడ్డుచెప్పలేక పోయాను. ఏ సంవత్సరమో గుర్తు లేదు కాని, మైసూరు విశ్వవిద్యాలయం వైస్‌ఛాన్సలర్ శ్రీ హనుమంతయ్య బాబా మహిమలను పరీక్షిస్తానని సవాల్ చేశారు. తరువాత సాయి భక్తులు ఆయనపై విరుచుకపడి రాజీనామా చేసే పరిస్థితి తీసుకొచ్చారు. కమ్యూనిస్ట్ నాయకులు శ్రీ పుచ్చల పల్లి సుందరయ్య ఒకసారి పుట్టపర్తి వెళ్లి బాబాను కలిసే సామాన్య ప్రజల గుంపులో కూర్చున్నారట. తన వద్దకు ఆయన రాగానే తనను తాను పరిచయం చేసుకొని కొన్ని సందేహాలు తీర్చుకోవాలని అడుగగానే, క్షణం ఆలోచనలో పడిన బాబా మరొకసారి రమ్మన్నారట. శ్రీ సుందరయ్య చనిపోయిన తరువాత మాత్రం బాబా ఒక నాస్తికుడు తనను పరీక్షించను వచ్చి, ప్రశంసించి వెళ్లినట్లు చెప్పుకొన్నాడు. చార్వాకుడూ, సోక్రటీసు సత్యాన్వేషణ కోసం శ్రమించిన మహాయోధులు. మీరూ అదే బాటలో సాగాలి. ఏరోజుకైనా విజయం నిజాయతీవైపే వుంటుంది.

రాపూరు - డి.ఎల్. నరసింహం

### అసౌకర్యం కల్గితే ఫిర్యాదు చేయండి!

డిశంబర్ 10 తేది జమీన్‌రైతు సంచికలో స్టేట్ బ్యాంకు ఆఫ్ ఇండియా వుద్యోగుల వల్ల ఖాతాదారులు ఇబ్బంది పడుతున్నట్లు

**జనవాణి**

జనవాణిలో ఒక లేఖ ప్రచురిత మైంది. వాస్తవంగా ఖాతాదారులకు ఏమైనా అసౌకర్యం కల్గితే వున్నతాధికారులకు ఫిర్యాదు చేయమని మనవి. అటువంటి సిబ్బంది పై తప్పకుండా చర్య తీసుకొంటాము. నిర్దిష్టమైన సంఘటనలు ఏవి జరిగినా దృష్టికి తేవాలని మనవి.

-డబ్ల్యు రాధాకృష్ణయ్య
-అసిస్టెంట్ జనరల్ మేనేజర్
తిరుపతి ఎస్.బి.ఐ.

## భారతీయులకు సెక్స్ విజ్ఞానం వద్దని వాదించడం అజ్ఞానం

ఉష్ణ దేశీయులైన భారతీయులకు సెక్స్ విజ్ఞానం అవసరం లేదనడం సమంజసం కాదు. ఈ మాట చెప్పేందుకు ముందు కొన్ని చారిత్రక విశేషాలను కూడా పరిశీలించాలి. పూర్వం ఆదిమానవులు దొరికింది తిని ఆకలి తీర్చుకునేవారు. అప్పట్లో జంతువులకూ, మానవులకూ ఆహారం విషయంలో పెద్దతేడా లేదనొచ్చు. కాని మానవుడి మేధాశక్తి మూలంగా క్రమక్రమంగా విజ్ఞానం పెరిగి ఎన్నో ఆహార పద్ధతులు వచ్చి, ఎవరికి ఏదికావాలో అది తింటున్నారు. ఆకలివేస్తే తినడం ప్రకృతి సిద్ధం అని వూరుకొంటె అభివృద్ధి సాధ్యమయ్యేదా?

లైంగిక సంతృప్తి విషయంలోనూ ఆలోచనలలోనూ ఉష్ణ దేశీయులైన భారతీయులు ఎప్పుడో ముందడుగు వేశారు. ఆకృషి ఫలితమే వాత్స్యాయన కామసూత్రాల గ్రంథం. ప్రపంచంలోని అన్ని భాషల్లోకి అనువదింపబడి సెక్సాలజిస్టులకు స్ఫూర్తి నిచ్చింది ఆ గ్రంథం. ఆంత్రోపాలజీ, సోషియాలజీ, సైకాలజీలలో జరిపిన పరిశోధనలలో లైంగిక సంతృప్తి ప్రధానంగా స్త్రీ పురుషుల మనోభావాలపై ఆధారపడి వుందని నిర్ధారించారు. ఈ విషయంలో మాత్రం దేశాల మధ్య తేడాలు లేవు. భార్యాభర్తల మధ్య పరస్పర గౌరవం, అనురాగం పెంపొందించి అసంతృప్తి లేకుండా చేయడమే సెక్స్‌థెరపీ ప్రధాన లక్ష్యం. కాని విజ్ఞాన దాయకమైన థెరపీపై మక్కువ చూప

కొరవ 10 పేజీలో

31.12.1943
పేజీలు 6, వెల 0-1-6

### గ్రామసీమలు

#### గూడూరు

ఏ దుర్ముహూర్తాన కలరా దేవత వూళ్లో ప్రవేశించిందో గాని 1 తేది నుండి కొళాయిలకు నీళ్లు రావడం లేదు. ఇంటర్నేషనల్ హేమా హేమీలు తమ లాభ నష్టాల గొడవే గాని పబ్లిక్ కార్యాల మీద అభిరుచి ఉంటే గద?

సి.యార్. నాయుడు డిపోల్లో పనిజేసిన కూలీలు లబ్బున మొత్తు కుంటున్నారు. బట్వాడాలు యివ్వలేదని, అత్తివరం డిపోలో గూడా అదే గోల. ఈకరువు కాలాల్లో యిలాంటి అధిక మోసాలు గూడానా?

**జమీన్‌రైతు**

కురుగొండ డాక్టరు పుత్రునికి, భార్యకు, స్ఫోటకం పోస్తే వూళ్లో వాళ్లు యెల్లమీద గుడిసె వేసి అక్కడకు అంపకాలు జేశారు. అలా పంపదలచుకుంటే మంచి యిల్లు వేసి తగు వసతులు ఏర్పరచుకుంటే నెల్లూరు మున్సిపల్ పెద్ద మాదిరి దుర్గతికి కారణ మౌతుంది.

- ఒ.వి.

#### యాకసిరి - విన్నమాల

ఇద్దరు టీచర్లము ఒకరొకరం వప్పుకొని ట్రాన్సుఫరుకు జిల్లా బోర్డుకు పిటీషన్ పెట్టుకుంటే యీ పారోహితు డెవడయా రు 10 తెమ్మంటాడు? ఇక మమ్ము బాధ పెడితే కుండ పగుల గొట్టవలసి వస్తుంది. తర్వాత తమ చిత్తం.

- ఆ యిద్దరు

#### యల్లాయపాళెం

ఇద్దరు కొట్లు 22 రాత్రి చోరగ్రస్తమైంది. పెట్టెలో రు 180 రొక్కముంది. వెతికిస్తే పెట్టె యొక్క డిస్కు మాత్రం ప్రక్క బావిలో కనిపించింది. వస్తాలేమీ దొరకలేదు. సన్నజనం చీట్లాట - చిత్తు పత్తు ఆడుతుంటె అడిగే దిక్కు లేనప్పుడు

**50 ఏళ్ళ క్రితం ఈ వారం**

చోరీలు జరక్కుండా ఎలా వుండగలవు?

- ఏ. కృష్ణారెడ్డి

#### వెంకటగిరి

1939 పంచాయితి బోర్డు ఎలెక్షన్‌లో చిన్న దొర గారి ధనబలమే బడాయి గొట్టిన స్వతంత్ర పార్టీని గెలిపించింది. యీ వేళ చిన్న దొర మాట విననందున 15 మందిని బలవంతంగా రాజీనామా పెట్టించిరి. ఇక ప్రెసిడెంటు లింగు లింగుమని ఏమిజేస్తాడు? పం. ఆ. విచ్చేశారు. ఆతిథ్యం స్వీకరించారు. ఫలితం సప్లై ఆఫీసరు నియామకం ఎంత స్వాదన్యంగా వుందో చూడండి!

చెరువు క్రింద పైర్లకు పూర్తి తెగులు. పంట శూన్యం. చెర్లో నీరున్నా చిన్న దొరవు వుత్తర్వు లేరట మరొక పైరైనా పెట్టుకొని జీవించడానికి డిప్టి తహశీల్దారు గారు గ్రోమోరు ఫుడ్ క్రింద తమరైనా అనుగ్రహిస్తారా?

-పౌర రైతు

కొరవ 12 పేజీలో

# పాత్రికేయుల సభకూ పోలీసు బందోబస్తు కావల్సినట్లుంది!

జర్నలిస్టుల సంఘం ఎన్నికలకు కూడా ఇక నుండి పోలీసు బందోబస్తు కావలసి వస్తుంది; 144 సెక్షన్ విధించాల్సిన పరిస్థితి వచ్చినా ఆశ్చర్యం లేదు. రాజకీయ వాదుల పదవీ కాంక్షపై వార్తలు రాసి రాసీ పాత్రికేయులకు కూడా పదవుల పిచ్చి పట్టుకొన్నదేమో నన్పిస్తుంది- 26 తేది కస్తూరిదేవి కళాక్షేత్రంలో నెల్లూరు జిల్లా జర్నలిస్టు యూనియన్ జరిగిన సర్వసభ్య సమావేశం తీరు చూస్తే! తమ తమ వర్గాలతో కలసి వైరి వర్గాలతో తలపడను జర్నలిస్టు లంతా సన్నద్ధులై వచ్చారు. గత సంవత్సరపు పాలక వర్గం పని తీరు పై సభ్యులు చేసిన సద్విమర్శలతో సమావేశం వేడెందుకొంది. అరుపులు, పెడబొబ్బలతో పాటు, బాహాబాహికి ఫుల్ షర్టులు సర్దుకొన్నారు. తన్నుకొని కేసులు పెట్టుకొంటే తామెక్కడ సాక్ష్యం చెప్పాల్సివస్తుందని భయపడ్డారేమో, రాష్ట్ర యూనియన్ నుండి పరిశీలకులుగా వచ్చిన పెద్దలు మైకు పెరుక్కొని ఎన్నికే రద్దు చేస్తున్నామని ప్రకటించే సరికి మహాసంగ్రామానికి తెరపడింది. జనవరి 30 తేది

## నెల్లూరు సంగతులు

కావలిలో మళ్లీ రణరంగానికి ముహూర్తం పెట్టి జి.టి. రైలెక్కారు పెద్దలు. బహిరంగంగా ప్రకటించక పోయినా ఇటీవల జిల్లాలో రెండు పెద్ద దిన పత్రికల విలేఖర్ల పై వచ్చిన అవినీతి ఆరోపణలను విచారించను రాష్ట్ర కమిటీ నొక దానిని పంపుతున్నట్లు చావు కబురు చల్లగా చెప్పి పోయారు.

పుదయం జరిగిన సభకు యూనియన్ అధ్యక్షులు బి.ఎస్. వెంకట సుబ్బయ్య అధ్యక్షత వహించారు. ముఖ్య అతిథిగా విచ్చేసిన రాష్ట్ర పురపాలక శాఖామాత్యులు శ్రీ మాదాటి నారసింహా రెడ్డి మొదలు ఇళ్లమంత్రి శ్రీ పసల పెంచలయ్య, ఎమ్మెల్యే శ్రీ జె.కె. రెడ్డి, మాజీ మంత్రి శ్రీ ఆనం రామనారాయణ రెడ్డి విలేకరుల పై తమకున్న కోపాన్నంతా కుమ్మరించారు. పోయిన సారి తిట్టిన కలెక్టర్ శ్రీ ఎం. సాంబశివ రావు మాత్రం ఈసారి ప్రశంసించారు. శ్రీ మాదాటి నారసింహారెడ్డి మాట్లాడుతూ

కొరవ 13 పేజీలో

నెల్లూరు జిల్లా జర్నలిస్టుల సంఘం సమావేశంలో మాట్లాడుతున్న మునిసిపల్ మంత్రి నారసింహారెడ్డి, ఆనం రామనారాయణ రెడ్డి, జెకె రెడ్డి, సిరాజ్, మంత్రి పెంచలయ్య, ఉదయం వెంకట సుబ్బయ్య, కలెక్టర్ సాంబశివ రావు, ఆంధ్రజ్యోతి ఉపేంద్రబాబు.

# ఎమ్మెల్యేలు హుషారు కాకుంటే ఎన్నికల్లో సీట్లన్నీ గోవిందా!

పి.సి.సి. అధ్యక్షుడు శ్రీ మజ్జి తులసీదాస్ 26 తేది కావలిలో యు.సి.పి.ఐ. మహాసభలో పాల్గొనను వచ్చి, చుట్టపు చూపుగా ఇందిరా భవన్‌లో కాంగ్రెస్ కార్యకర్తల సమావేశం లోనూ పాల్గొని ప్రసంగించారు. డిసిసి అధ్యక్షులు ఆనం సంజీవ రెడ్డి ఏర్పాట్లు ఘనంగా చేయడంతో పాటు భారీగా కార్యకర్తలను రప్పించి చప్పట్లు కొట్టించి పి.సి.సి. అధ్యక్షుడి ముఖారవిందాన నవ్వులు

## నెల్లూరులో మజ్జి

పూయించారు. వేదిక పైన పురపాలక శాఖామంత్రి శ్రీ మాదాటి నారసింహా రెడ్డి, ఇళ్ల మంత్రి శ్రీ పసల పెంచలయ్య, ఎం.పి. కుమారి పద్మశ్రీ, ఎమ్మెల్యేలు జె.కె. రెడ్డి, సి.వి. శేషారెడ్డి, పట్టా ప్రకాశ రావు, డి.సి.సి.బి అధ్య[illegible] వేమారెడ్డి రామచంద్రా రెడ్డి ఆశీనులయ్యారు. శ్రీ మజ్జి తులసీదాస్ మాట్లాడుతూ దేశ సౌభాగ్యం కాంగ్రెస్ పార్టీ పై ఆధారపడి వున్న విషయం ప్రజలు మరవ కూడదు. పార్టీ రైతుల కోసం విశేష కృషి చేస్తున్నది. స్వాతంత్ర్యం రాక మునుపు బానిసలుగా బ్రతికే రైతులు నేడు దర్జాగా బ్రతుకు తున్నారన్నారు. కేవలం సినిమా డైలాగులతో ఏడేళ్లు రాష్ట్రాన్ని పాలించి వెనక్కు తీసుకెళ్లిన ఎన్టీరామారావు కొత్త పెళ్లికొడుకు వేషంలో మోసగించను మళ్లీ వస్తున్నాడని, ప్రజలు ఈ విషయం గుర్తు పెట్టుకొని తగిన బుద్ధి చెప్పాలన్నారు.

శ్రీ మాదాటి నారసింహా రెడ్డి మాట్లాడుతూ ప్రతిదానికీ పత్రికల కెక్కడం మంచిది కాదని, కాంగ్రెస్ నేతలు ఈ సంస్కృతికి స్వస్తి చెప్పాలన్నారు. ఇళ్లమంత్రి శ్రీ పసల పెంచలయ్య పార్టీ ప్రజలకు చేస్తున్నది చెప్పుకోలేని పరిస్థితిలో వుందని, తాను ఇన్‌ఛార్జి మంత్రిగా వున్న అదిలాబాద్‌లో పార్టీకార్యకర్తలు హుషారుగా కలిసికట్టుగా పనిచేస్తున్నారని చెప్పారు.

జిల్లాలో దరిదాపు అందరూ కాంగ్రెస్ ఎమ్మెల్యేలే అయినా, పార్టీ కార్యక్రమాలు మందకొడిగా సాగుతున్నాయి. ఇలా అయితే రాబోయే ఎన్నికల్లో సీట్లు కోల్పోతామని డి.సి.సి. అధ్యక్షుడు శ్రీ ఆనం సంజీవరెడ్డి హెచ్చరించారు. తెలుగుదేశం మహిళా సదస్సు మగనాయకుల బల ప్రదర్శన

కొరవ 10 పేజీలో



# సఖుగుడు

## * రాజకీయాల్లో సారా కుళ్లను చట్టాలు కడగలేవు!

రచయిత వంద పేజీల్లో కూడా చెప్పలేని విషయాన్ని వెయ్యి తిరిగిన చిత్రకారుడు ఒక్క చిత్రంతో చెప్పగల్గుతాడని నానుడి; పై బొమ్మ చూస్తే అదెంత నిజమో తెలుస్తుంది; రాష్ట్రంలో నడుస్తున్న సారా రాజకీయం

తమరి మీద ముఖ్యమంత్రిగారు మరీ ఇదిగా కక్ష కట్టినట్టున్నారు సార్...

రోతను ఒకే ఒక్క పాకెట్ కార్టూన్‌తో కళ్లకు కట్టాడు "ఈనాడు" కార్టూనిస్ట్ శ్రీధర్. అంత సున్నితంగా, సాహసంగా రాజకీయ కుళ్లను కడిగినందుకు ఆ యువకుడ్ని మనసారా అభినంది స్తున్నాము.

రాష్ట్రంలో సగం మంది రాజకీయ వాదులకు సారా వ్యాపారంతో ప్రత్యక్షంగానో, పరోక్షంగానో సంబంధం వుంది. డబ్బు సంపాదించడం తప్ప. అది ఏ రూపంలో ఏ వ్యాపారంలో సంపాందించారన్నది అనవసరమనే అభిప్రాయం ప్రబలి పోయిన తర్వాత; రాజకీయానికి ఒకే ఒక అర్హత డబ్బు అనే ధోరణి పెరిగి పోయిన తర్వాత - దొంగసారా కాచి అమ్ముకునే వాళ్లు, వ్యభిచార గృహాలు నడుపుకునే వాళ్లు, హత్యలు చేసి బ్రతికే వాళ్లు, కాంట్రాక్టులు, క్లయిములు పేరుతో ప్రభుత్వ ఖజానాను పిల్చి పిప్పి జేసే వాళ్లు రాజకీయాల్లోకి నేరుగా దూకేశారు. వారే ఎమ్మెల్యేలు, వారే మంత్రులు, వారే కేంద్ర మంత్రులు అవుతున్నారు. రాష్ట్రంలో, కేంద్రంలో అధికారంలో వున్న ఒక్కొక్క రాజకీయ నాయకుడి గతం, ప్రస్తుతం రెండూ నిజాయితీగా వెలికి తీసి, లోకానికి చెప్ప గల్గే అవకాశమే వస్తే పోలింగ్ రోజు తాము ఎటువంటి ఘోరమైన పొరపాటు చేస్తున్నామో తెలిసి ప్రజలు మూర్ఛపోతారు.

రాష్ట్ర క్యాబినెట్‌లో ఈ రోజు సారా సిండికేట్ సభ్యులైన వారెందరు లేరు? కొత్తమంత్రి శ్రీ చెంగారెడ్డి ఇటు చిత్తూరు, నెల్లూరు జిల్లాలకు అటు మద్రాసుకు సారా వరద పారిస్తున్న ఒక మహా గొప్ప సారా సామ్రాజ్యానికి అధిపతన్న ఆరోపణ వుంది. చెన్నారెడ్డి

## డోలేంద్ర

క్యాబినెట్‌లో వున్నప్పుడు ఆయనే స్వయంగా చెక్ పోస్టులకు వెళ్లి, లేదా ఫోన్లు చేసి దొంగ సారా లారీలను విడిపించే వాడనే పేరుండేది; చిత్తూరు జిల్లాలో ఆయన ఆధిపత్యంలో వున్న నాటు సారా బట్టీలలో 11 సాచెట్ యంత్రా లున్నట్లు ఒక ఎక్సైజ్ అధికారి చెప్పాడు.

మొన్నటి వరకు హోంమంత్రిగా వుండిన అప్పటి

కొరవ 10 పేజీలో

# వెంకటగిరి చీరలంగళ్లను దాడులతో బెదరగొట్టేశారు!

ఉ.

గుంటూరు జనరల్ టాక్స్ స్క్వాడ్ బృందం ఈ మధ్య నెల్లూరు జిల్లాపై పడి పోయి వుంది. పెద్ద పెద్ద తిమింగలాలు వలను కొరికి తప్పించు కొంటాయి కాబట్టి మధ్యస్థాయి వ్యాపారులపై వల విసరడం అధికారులకు పరిపాటి. 15, 16 తేదుల్లో వెంకటగిరి జరీ చీరల షాపులపైకి మూకుమ్మడిగా దాడి చేసేసరికి వ్యాపారస్తులు భయపడి బిక్కు బిక్కు మంటూ పోయారు. పేరుగాంచిన మాధవరం జయరామయ్య, బాలాజీ, పరమేశ్వరి వస్త్రాలయాలతో పాటు మరో ఏడు అంగళ్లలోని స్టాకును పరిశీలించారు. ఏ అంగట్లోనూ కొనుగోలు, అమ్మకపు పుస్తకాలకు స్టాకుకు సంబంధమే లేదట. పోలీసు బందోబస్తుతో హంగామాగా తరలి వచ్చిన వారు రెండోరోజు గమ్మున బస్సులెక్కారట. అంతకీ లెక్కల్లో తేడాలున్న వారిని ఏంచేస్తారో వేచిచూడాలి. దాడి, సోదా మధ్యలోనే ఆపేసి అర్థాంతరంగా బస్సులెక్కడం వెనక గుసగుసలు; లోగుట్టు పెరుమాళ్లకెరుక!

### యు.సి.పి.ఐ. మహాసభలు

భారత ఐక్య కమ్యూనిస్టు పార్టీ ద్వితీయ రాష్ట్ర మహాసభలు డిశంబర్ 26, 27 తేదిలలో కావలిలో జరిగాయి. జాతీయ [illegible] ఆ పార్టీకి కాంగ్రెస్ పార్టీతో గల అవినాభావ సంబంధానికి [illegible] పోకుండా 22 మంది [illegible]. పెద్ద కాంగ్రెస్ నాయకులతో ఆహ్వాన సంఘం ఏర్పాటు చేశారు. యు.సి.పి.ఐ. జిల్లా కార్యదర్శి శ్రీ వి. నరసింహాచార్యులు ప్రచారం చేసినట్లు మంత్రులు, ఎం.పి లు రాక పోయినా రాష్ట్ర పి.సి.సి అధ్యక్షులు శ్రీ మర్రి తులసీ దాస్ బహిరంగసభలో పాల్గొని వారు లేనిలోటు తీర్చారు. ఆయన ఐక్య కమ్యూనిస్టు పార్టీయే నిజమైన కమ్యూనిస్టు పార్టీయని కితాబు నిచ్చారాయన. కాంగ్రెస్ పార్టీని ఓడించే శక్తి బి.జె.పి.కి గానీ ఇతర ప్రాంతీయ పార్టీలకు గానిలేదు; కాంగ్రెస్‌ను ఓడించడం ఒక్క కాంగ్రెస్‌లోని వాళ్లకే సాధ్యం. పార్టీలో అంతః కలహాలే పార్టీకి ముసల మన్నారు. యు.సి.పి.ఐ. పార్టీ జాతీయ అధ్యక్షులు, పార్లమెంట్ సభ్యులు శ్రీ పాండ్యన్ ప్రధాని శ్రీ పి.వి. నరసింహారావు నూతన ఆర్థిక విధానాలను ప్రశంసించారు. సభ ముందు వేయి మంది కార్యకర్తలతో ప్రదర్శన నిర్వహించారు. ఆరోజు వుదయం శివాలయం వీధిలో జరిగిన పార్టీ కార్యకర్తల సమావేశానికి జాతీయ ప్రధాన కార్యదర్శి శ్రీ మోహిత్ సేన్ వక్తగా విచ్చేశారు. భారత దేశానికి బయటి నుంచి అమెరికా వల్ల, లోపల నుండి బి.జె.పి వల్ల ప్రమాదం వుందని చెబుతూ బి.జె.పి. హిందువులను ముస్లింలీగ్ ముస్లింలను రెచ్చగొడుతున్నా యన్నారు. డంకెల్ ప్రతిపాదనల పట్ల రైతులు భయపడవలసిన అవసరం లేదని చెప్పారు. 'గాట్' లో వుంటూనే మానవ హక్కుల కోసం భారత దేశం పోరాడాలని సలహా యిచ్చారు శ్రీ మోహిత్‌సేన్.

## జిల్లావార్తలు

### జోరేపల్లి రోడ్డు పూర్తయ్యేదెన్నడో?

పంచాయతీరాజ్ శాఖ ఇంజనీర్ల అసమర్థత ఆగ్రామం పాలిట శాపంలా పరిణమించింది. రాపూరు మండలం జోరేపల్లి గ్రామానికి రోడ్డువేయను 91 లో మూడు లక్షల రూపాయలు మంజూరయ్యాయి. ఆ సంవత్సరమే కాంట్రాక్టరుకు వర్క్ ఆర్డర్ ఇస్తూ 92 చివరికల్లా రోడ్డు పూర్తి చేయాలని ఆదేశించారు. కాంట్రాక్టర్ ఒక బిట్ వరకు రోడ్డు పూర్తి చేసి 50 వేల రూపాయలు బిల్లు పొందాడు. తరువాత మిగతా రోడ్డు విషయాన్ని

కొరవ 8 పేజీలో

ప్రముఖ సినీ హాస్యనటుడు స్వర్గీయ రమణారెడ్డి గారి కనిష్ట పుత్రుడు శ్రీనివాసులు రెడ్డి ఎం.టెక్‌కి, వింధ్య వివాహం 8 తేదీ హైదరాబాదులో జరిగింది

## పెండ్లిండ్లు

### డాక్టర్ కెఇ రెడ్డి

శాస్త్రవేత్తగా, పారిశ్రామికుడిగా విజయలక్ష్మి చేతిని వదలకుండా పట్టుక వస్తున్న మద్రాసు నెల్లూరీయుడు శ్రీ కెఇ రెడ్డి కుమారుడు ఫణిధర్ బిఇ, ఆంధ్ర నుంచి వలస పోయి కేరళలో స్థిరపడి, వస్త్ర వ్యాపారంలో ఆ రాష్ట్రంలో కెల్లా పేరున్న సంస్థ - పార్థ టెక్స్‌టైల్స్‌ను యాభై ఏళ్లకు పై నుంచి నిర్వహిస్తూ, మలయాళీలతో రెండు తరాలు గడిపినా తెలుగు సంస్కృతిని పదిలంగా కాపాడు కొంటూ వస్తున్న శ్రీ ఎం. శ్రీనివాస 'రెడ్డియార్' మనుమరాలు, శ్రీ నాగరాజులు కుమార్తె జయశ్రీ బి.ఎ., పరిణయం డిసెంబరు 9 తేదీ త్రివేండ్రంలో వైభవంగా జరిగింది. అంత దూరం రాలేని మిత్రులకు కెఇ రెడ్డి గారు 12 తేది మద్రాసు రేస్ క్లబ్‌లో కమ్మటి విందు చేశారు.

కెఇ రెడ్డి అంటే కోవూరు తాలూకా పొటుకూరు వాసి; మద్రాసు సెంట్రల్ లెదర్ రీసెర్చ్ ఇన్‌స్టిట్యూట్‌లో ఆర్గానిక్ కెమిస్ట్రీ శాఖాధిపతిగా పనిచేసిన వారు. ఆ రోజుల్లో ఆయన కనిపెట్టిన ఒక చర్మ పరిశ్రమ రసాయనం ఈనాటికీ ప్రపంచంలో ప్రామాణిక మైనదిగా పరిగణింప బడుతున్నది. దశాబ్దాల శాస్త్ర పరిశోధనలో విసిగిపోయిన

కొరవ 6 పేజీలో

# ఉత్తరక్రియలు

మా తండ్రి

## మనుబోలు శ్రీనివాసులు రెడ్డి గారు, M.A., M.Ed.;

టీచరు, Z.P. హై స్కూలు, గూడూరు.

21.12.93 తేది మంగళవారం రాత్రి 2.30 గంటలకు స్వర్గస్థులైనారు.

5.1.94 తేది బుధవారం - శిలాప్రతిష్ఠ

6.1.94 తేది గురువారం - ఎత్తురేవు

గూడూరు, హై స్కూలు రోడ్డులోని మా స్వగృహమున జరుగును.

కావున తెలియచేయడమైనది

మనుబోలు నరహరిరెడ్డి

మనుబోలు దామోదర్‌రెడ్డి, M.Tech
Lec. S.V.U.Eng. College.

**కుటుంబ సభ్యులు**

మనుబోలు శ్రీదేవమ్మ - తల్లి
మనుబోలు వేదవతమ్మ - భార్య

చెల్లెలు - బావ: దువ్వూరు రంగనాయకమ్మ - లక్ష్మినారాయణ రెడ్డి, Retd. Municipal Commissioner
చెల్లెలు - బావ: చెలికం రాజేశ్వరి - రమణారెడ్డి, Agl. Extn. Officer - [illegible]
కుమార్తె - అల్లుడు: భార్గవి - మాంగుంట శ్రీకాంత్‌రెడ్డి, B.Tech.
మనుమరాళ్లు: మాంగుంట మౌనిక, మాంగుంట స్వప్నిక

# అందరం ఐక్యంగా వుంటే అధికారం మనదే!

కుల ప్రస్తావన లేనిదే ఏదైనా కదలని రోజులివి. ఎవరే పని చేసినా దాని వెనుక కులం ప్రభావం వుందేమోనని వెతికే దురదృష్టకర పరిస్థితులు రాజ్యం చేస్తున్న దినాలివి. జన సంఖ్య చూస్తే జాస్తిగా కన్పిస్తూ, వెలుగులో వుండే వారిని మార్గాముంటే కాగడా వేసినా కన్పించని దుస్థితి వుండటం కులపరంగా బలోపేతం వారెవరికైనా కష్టమైన సంగతే కదా! అందుకే తమ కుల పోల్లనందర్నీ కలిపి, మంది బలానికి కుల సంఘాన్ని బలోపేతం చేయ యత్నిస్తున్నారు - మాధవయ్య ఫర్నిచర్ అంగడి విజయ కుమార్. మొన్న 26 తేది వరసింహుల కొండ

## బలిజ సంఘం సమర శంఖారావం

పైన వనమహోత్సవం పేరుతో బల ప్రదర్శన చేశారు. 5 వేల మంది బలిజ కులస్తులు వచ్చారట. శ్రీ చదలవాడ కృష్ణమూర్తి నాయకత్వం వహించి, బలిజ సంఘం పతాకం ఆవిష్కరించారు. సభను ముని అర్పు మునికుమార్ నాయుడు అధ్యక్షించారు. బలిజ కులస్తులను బిసిల జాబితాలో చేర్చాలని తీర్మానించారు. అందరం ఐకమత్యంగా వుంటే, వట్టి గుర్తింపేమి ఖర్మ, అధికారమే మన పరమౌతుందన్నారు విజయకుమార్. ఆ ఐకమత్యం ఎక్కడ నుంచి తెస్తాం చెప్పండి?

సభలో శ్రీ చదలవాడ వెంకట శేషయ్య, దవనం వెంకటేశ్వర్లు, డి. ప్రతాప్ కుమార్, అరిగెల కోదండ రామయ్య, గుడిపల్లిపాడు బాబూరావు, తలమంచి సుబ్రహ్మణ్యం, పెద్దిశెట్టి ప్రభాకర రావు, నక్కా బాలకోటయ్య తదితరులంతా మాట్లాడారు. శ్రీ కూరపరెడ్డి విజయకుమార్ వందనాలు చెల్లించారు. ఆడా, మగలకు విడివిడిగా ఆటల పోటీలు జరిగాయి. అందరికీ అక్కడే భోజనాలు వండి, వడ్డించారు.

బలిజ సంఘం వనమహోత్సవ బల ప్రదర్శనలో పసుపులేటి విజయకుమార్, చదలవాడ కృష్ణమూర్తి, మునికుమార్ నాయుడు, చదలవాడ వెంకట శేషయ్య, దవనం వెంకటేశ్వర్లు

ఆర్.ఓ.సి.నెం. 16/93

గ్రామపంచాయతీ కార్యాలయము,
నార్తుమోపూరు., తే 21-12-93ది

### టెండరు ప్రకటన

అల్లూరు మండలం, నార్తుమోపూరు గ్రామపంచాయతీ గ్రంధాలయమునకు కావలసిన పత్రికలు (సమాజములో ప్రాచుర్యము పొందిన) సరఫరా చేయుటకు నార్తుమోపూరు గ్రామపంచాయతీ కార్యాలయము నందు గ్రామ పంచాయతీ కార్యనిర్వహణాధికారి గారిచేగాని లేదా వారి అనుమతి పొందిన వారిచేగాని తే5-1-94 ది ఉదయము11.00 గంటల వరకు సీల్డు టెండర్లు స్వీకరించబడి అదే దినము మధ్యాహ్నము 12.00 లకు హాజరైన టెండరు దారుల సమక్షమున టెండర్లు తెరువబడును. టెండరులో పాల్గొనదలంచిన వారు రూ100/- లు ధరావత్తు ముందుగా చెల్లించి రశీదు పొంది సదరు రసీదును టెండరుకు జతపరచవలయును. టెండరు ఫారములు గ్రామపంచాయతీ కార్యాలయము నందు లభ్యమగును. ఇతర వివరములు గ్రామపంచాయతీ కార్యాలయము పని చేయువేళలలో అడిగి తెలుసుకొనవచ్చును.

వై. హరిప్రసాద రెడ్డి
కార్యనిర్వహణాధికారి I/C, నార్తుమోపూరు గ్రామపంచాయతీ

డాక్టర్ పి.సి. రెడ్డి గారి 77 వ జన్మదినోత్సవ అభినందన సభకు విచ్చేసి విజయప్రదం చేసిన పెద్దలందరికీ మా హృదయ పూర్వక కృతజ్ఞతలు.
- ఆహ్వాన కమిటీ



# పెండ్లిండ్లు

(5 పేజీ కొరవ)

ఆయన ఆ సంస్థ నుంచి బయటపడి, స్వంత పరిశ్రమ స్థాపించి, దిగ్విజయంగా నడిపిస్తున్నారు. మన టెక్నో కాస్టింగ్స్ కృష్ణారెడ్డి గారి వియ్యంకుడు కూడా!

## పొట్టెంపాడు పెండ్లి

పొట్టెంపాడు, శ్రీ రామవరపు శ్రీనివాసులు రెడ్డి కుమార్తె భావచందన, కృష్ణా జిల్లా గణప వరం మాజీ జమిందారు శ్రీ బి. వెంకటేశ్వర రెడ్డి కుమారుడు బిమల్ కుమార్ పెండ్లి 8 తేది నెల్లూరు టిటిడిలో జరిగింది.

## రమణారెడ్డి కుమారుడు

హాస్యనటుడుగా తెలుగు చిత్ర పరిశ్రమలో చెరగని స్థానం సంపాదించుకొని, అకాలంగా మృత్యువు పాలైన స్వర్గీయ టివి రమణారెడ్డి చిన్న కుమారుడు, అమెరికా విద్యావంతుడు శ్రీనివాస రెడ్డికి; హైదరాబాదు, రిటైర్డ్ లెఫ్టినెంట్ కల్నల్ శ్రీ బి. అభిమన్యు రెడ్డి కుమార్తె వింధ్యతో పరిణయం 8 తేది సికింద్రాబాద్ లా - పలాయస్ - రాయల్ విల్లాలో జరిగింది. రమణారెడ్డి పెద్ద కుమారుడు శ్రీ తిక్కవరపు ప్రభాకర రెడ్డి కార్యభారం వహించారు.

## నవాబ్ నిఖా

జిల్లా రైతాంగానికి కంతటికి సుపరిచితుడు, కదలనని మొరాయించే ఎంతటి మొండి ట్రాక్టర్ అయినా తాను చేయి పెట్టగానే బుద్ధిగా చెప్పిన మాట వినేటట్లు చేయగల చేయి తిరిగిన ట్రాక్టర్ మెకానిక్, పొగతోట శ్రీ నవాబ్ కుమార్తె జబీనా, విఆర్ కాలేజి లెక్చరర్ స్వర్గీయ ఎం.ఎ.కె. ఫరూఖ్ సాహెబ్ కుమారుడు జఫర్ ఇస్లాం సజీద్ బి.టెక్.ల ల నిఖా 16 తేది రాఘవ కళ్యాణ మండపంలో కమ్మటి బిర్యాని ఘుమఘుమల సమ్మిళితంగా జరిగింది.

## విశ్వనాథం మనుమరాలు

హిందు విలేఖరిగా యాభై ఏళ్ల పాటు పనిచేసిన శ్రీ చుండి విశ్వనాథం మనుమరాలు, డాక్టర్ సత్యనారాయణ కుమార్తె పార్వతి; శ్రీ కె.ఎస్. మహదేవన్ కుమారుడు సుబ్రహ్మణ్యంల కళ్యాణం 19 తేది కర్నూలు టిటిడిలో జరిగింది.

## బొంబాయి పెండ్లి

బొంబాయిలో స్థిరపడిన నెల్లూరీయుడు స్వర్గీయ వీరభద్ర వెంకట రావు, శ్రీమతి సుశీలాదేవిల కుమారుడు దేవానంద్, అక్కడికే చెందిన కమల్‌సింగ్ రావత్ కుమార్తె షీల పరిణయం 15 తేది బొంబాయి, కెఆర్ కామా ఇన్స్‌టిట్యూట్ హాల్‌లో జరిగింది.

## దామేగుంట

కొడవలూరు మండలం, దామేగుంట శ్రీ పొట్ల రమణయ్య కుమారుడు రఘురామయ్య, వేగూరు శ్రీ పసుపులేటి రమణయ్య కుమార్తె సుభాషిణిల పెండ్లి 8 తేది నెల్లూరులో జరిగింది.

# నెల్లూరు రచ్చబల్లి

విమర్శకుడు

### రోడ్లమంత్రి

రోడ్లమంత్రి శ్రీ పురుషోత్తమ రావు 3 తేది నెల్లూరు వస్తున్నారు; ఎమ్మెల్యే శ్రీ ఏ.వి. శేషారెడ్డి ఆతిథ్యంలో సర్వేపల్లిలో పర్యటిస్తారు.

### ఇళ్లమంత్రి

ఇళ్లమంత్రి శ్రీ పసల పెంచలయ్య 30 తేది వచ్చారు; ఈ రోజు కూడా నెల్లూరులోనే వున్నారు. ఎప్పుడు వెళ్లేది తెలియదు.

### ఉత్తరాది పర్యటనలో జనార్దన రెడ్డి

మాజీ ముఖ్యమంత్రి రాష్ట్ర కాంగ్రెస్ నాయకుడు నేదురుమల్లి జనార్దన రెడ్డి 4 రోజుల నుంచి ఢిల్లీలో వున్నారు; ఈ రోజు (31 తేది) హైదరాబాదుకు వచ్చి, తిరిగి 4 తేది ఢిల్లీ వెళ్తారు. 16 తేది వరకు ఉత్తరాది రాష్ట్రాల పర్యటన రాజస్థాన్, హిమాచల్ ప్రదేశ్, మధ్యప్రదేశ్, మిజోరాంలలో ఇటీవల జరిగిన అసెంబ్లీ ఎన్నికలలో కాంగ్రెస్ పరిస్థితి, తదనంతర పరిణామాలు అధ్యయనం చేసి తనకొక నివేదిక ఇవ్వమని ప్రధాని శ్రీ పివి. జనార్దన రెడ్డిని కోరారు. పహాకారంగా కొందరు ఎమ్మెల్యేలనూ ఇచ్చారు. ఆయనిప్పుడు ఆ పర్యటనలో వున్నారు.

### ముఖ్యమంత్రితో జిల్లా ఎమ్మెల్యేలు

ముఖ్యమంత్రి శ్రీ కోట్ల విజయభాస్కర రెడ్డి జిల్లాల వారీగా ఎమ్మెల్యేలతో జరుపుతున్న సమావేశాలలో, 30 తేది నెల్లూరు వంతు వచ్చింది. అయితే సమావేశం మూడు నిముషాలు కూడా జరగలేదు. తెలుగు గంగకు సంబంధించిన ఒక ప్రత్యేక సమావేశానికి వేళ కావడం; 11 గంటలకు ఢిల్లీ విమానమెక్క వలసి రావడంతో ఎమ్మెల్యేలతో ఆయనేమీ మాట్లాడలేక పోయారు. వీరు కూడా విడివిడిగా చెప్పే వ్యవధి వుండదని తెలిసి, జిల్లాలో కావలసిన పనులు, కోర్కెల జాబితాను వినతి పత్రంగా తయారు చేసుకొని పోవడంతో, అది సమర్పించి దండం పెట్టి వచ్చేశారు.

మంత్రి శ్రీ కలికి యానాది రెడ్డి, ఎమ్మెల్యేలు [illegible] రెడ్డి, సివి శేషారెడ్డి, డాక్టర్ సుందర రామరెడ్డి, కె. విష్ణువర్ధన్ రెడ్డి, మాదాల జానకి రాం ఈ సమావేశానికి హాజరైనారు.

## జనార్దన రెడ్డికి కేంద్రంలో స్థానం?

రాష్ట్ర కాంగ్రెస్ నాయకుడు శ్రీ నేదురుమల్లి జనార్దన రెడ్డికి త్వరలో జరుగనున్న కేంద్రమంత్రి వర్గ విస్తరణలో స్థానం కల్పించ వచ్చునని అనధికార శుభవర్తమానం. ముందుగా అనుకున్న ప్రకారం పార్లమెంట్ సమావేశాలు ముగియగానే విస్తరణ జరగాలి. కాని ఆంధ్ర సాంప్రదాయాలను పాటించే ప్రధాని, ధనుర్మాసం సమయంలో తగిన ముహూర్తాలు వుండవన్న ఉద్దేశ్యంతోనే ఏమో, జనవరి 18 తేది వరకు వాయిదా వేసినట్లు చెప్తున్నారు.

జనార్దన రెడ్డి ఇటీవల ప్రధాని శ్రీ పివికి అంతరంగికుడుగా సన్నిహితమైనారు. ప్రచారం లేకుండా, సవ్వడి చేయకుండా ఢిల్లీ రాజకీయాలలో వేలు దూర్చి, ఆరు నెలల్లో మనిషంతా సర్దుక పోయారు. జనార్దన రెడ్డి చాతుర్యమే అది కదా? పివి నరసింహా రావు ఆయనకు తరచు ఇంటర్వ్యూ ఇవ్వడమే కాదు, ఒక్కొక్క సారి అంతరంగిక విషయాలు చర్చించను గంటల తరబడి తన కారులోనే, తన కార్యక్రమాలిన్నంటికి తన తోటి తీసుక వెళ్తున్నారు. ఈ చనువు, సాన్నిహిత్యాలు కేంద్ర మంత్రి వర్గంలో ఆయనకు తప్పక స్థానం కల్పిస్తాయని పరిశీలకుల అంచనా.

కొరవ 8 పేజీలో



మద్రాసు పారిశ్రామికుడు కె.కె. రెడ్డి కుమారుడు ఫణిధర్, జయశ్రీ; వీరి వివాహం 9 తేది త్రివేండ్రంలో జరిగింది.

### అంకయ్య గౌడ్‌కు అంత ఆవేశమెందుకు?

పొదలకూరు మాజీ మండలాధ్యక్షుడు శ్రీ రావుల అంకయ్య గౌడ్‌ను డిసిసి అధ్యక్షుడు శ్రీ ఆనం సంజీవ రెడ్డి పార్టీ నుంచి బహిష్కరించారు. ఉత్తరప్రదేశ్ ఎన్నికలలో సమాజ్ వాది జనతా పార్టీ గెల్చిన నాటి నుంచి అంకయ్య గౌడ్‌కు అటు వెళ్లాలనే పురపుర పుట్టినట్లుంది. ములాయం - కాన్షీరాంల కూటమి ఆంధ్రలోనూ అధికారంలోకి వచ్చేస్తుందన్న ఆశ. అట్లాంటి గౌడ్ వంటి వారిలో చాలా మందికి వున్నాయి. ఉత్తరప్రదేశ్‌కు, ఆంధ్రప్రదేశ్‌కు వున్న సామాజిక, రాజకీయ పరిస్థితుల వ్యత్యాసం అర్థం చేసుకొనే పరిణతి వారిలో లేకపోవడమే ఈ దురాశకు కారణం.

పార్టీ వదలి వెళ్లాలనుకునే వారు నిక్షేపంగా వెళ్లి వుండవచ్చు. అడ్డు పెట్టే వారెవరూ లేరు. కాని ఆ సాకుతో కాంగ్రెస్‌ను, కాంగ్రెస్ నాయకులను తీవ్రమైన భాషలో తిట్టి పోసి, మెడబట్టి బయటకు గెంటించు కోవలసిన పరిస్థితి తెచ్చుకోవడమే బాగాలేదు. గౌడ్‌కు జనార్దన రెడ్డి పై కష్టం వుంది. ఆయన ముఖ్యమంత్రిగా

కొరవ 8 పేజీలో

జమీన్‌రైతు

సంవత్సర చందా రూ. 100/-

అర్థ సంవత్సర చందా రూ. 50/-

విడి ప్రతి రూ. 2.00



### బద్ధకించదు

నెల్లూరు టవున్ కాపురస్తుడు స్వర్గీయ డాక్టర్ శ్రీ జొన్నలగడ్డ నారాయణయ్య గారు తన తాలూకా ఆస్తులను గురించి ఎలాంటి వ్రాతలు వ్రాయకనే తే7-11-86 న స్వర్గస్థులైరి. వారి మరణానంతరం వారి యావదాస్తులు వారసత్వేన వారి వారసులైన కుమారులకు, కుమార్తెలకు, వారి భార్యకు చెందియున్నవి. సదరు ఆస్తులను గురించి నెల్లూరు సబ్ కోర్టులో O.S. No. 305/93 లో దావా జరుగుచున్నది. సదరు నారాయణయ్య కుమారులు, భార్య 1. డాక్టర్ జె.వి. రామమోహన్ 2. J.V.కృష్ణప్రసాద్, 3. శ్రీమతి జొన్నలగడ్డ హైమావతమ్మ గార్లు సదరు నారాయణయ్య ఆస్తులను పరాధీనము చేయునట్లు తెలియ వచ్చినది. సదరు లేట్ జె.నారాయణయ్య గారి ఆస్తులను ఎవరూను పరాధీనము చేయుటకు హక్కులేదు. అట్లు చేసిన ఎడల మమ్ములను బద్ధకించదు. కాబట్టి యావన్మందికి యిందు మూలముగా తెలియజేయడమైనది.

పేరేపు రాజ్యలక్ష్మి
5/16 తూర్పువీధి, గూడూరు.

### A(4) (a) నోటీసు

ఇందుమూలముగా యావన్మందికి తెలియ జేయడమేమనగా, నెల్లూరు జిల్లా, ముత్తుకూరు మండలం, కృష్ణాపట్నం సాల్టు ఫ్యాక్టరీ యిలాకా, సాల్టు లైసెన్స్ నం. 12B / పేరెంట్, యొక్క ఏకైక లైసెన్స్ దారులైన శ్రీ తిరుపతి కృష్ణార్జున రావ్ అనువారు 19.11.93 తేదిన మరణించారు. వారి ముఖ్య వారసురాలైన శ్రీమతి తిరుపతి శారద అనువారు, లైసెన్స్ నం. 12B / పేరెంటును, అనుగుణముగా మార్చి వారి పేర యిప్పించ వలసినదిగా కోరి యున్నారు.

2. ఈ విషయమై ఎట్టి అభ్యంతరములు / ఆక్షేపణలు వున్న ఎడల, ఈ దిగువ సూచించిన ఆఫీసుకు, ఈ నోటీసు జారీ అయిన 30 దినములలోగా, వ్రాతపూర్వకముగా తెలియ జేయ వలెను. లేనిచో ఎవరికిని, ఎట్టి ఆక్షేపణలు / అభ్యంతరములు లేవని భావింపబడి, లైసెన్స్‌ను, కోరిన విధముగా శ్రీమతి తిరుపతి శారద గారి పేర మార్చి జారీ చేయబడును.

యం.వి. సత్యనారాయణ
సాల్టు ఫ్యాక్టరీ ఆఫీసర్
కృష్ణాపట్నం సాల్టు ఫ్యాక్టరీ

## నెల్లూరు ముచ్చట్లు

(7 పేజీ కొరవ)

వున్నప్పుడు తన నాటు సారా సామ్రాజ్యం పైన జరిగిన ఎక్సైజ్ దాడులు జనార్దన రెడ్డి ప్రేరణతోనే నని గౌడ్ కోపం. బట్టలు పగులగొట్టి, మెషిన్లు స్వాధీనం చేసుకొని తనను ఆర్థికంగా పతనం చేశారని, అదే సమయంలో జిల్లాలోని ఇతర నాటు సారా వ్యాపారులు కోట్లు సంపాదించు కున్నారని గౌడ్ అలుక.

అది కడుపులో పెట్టుకొని ఇన్నాళ్ల తర్వాత ఇప్పుడు జనార్దన రెడ్డిని తిడుతూ పత్రికలలో పెద్ద పెద్ద అడ్వర్‌టైజ్ మెంట్లివ్వడం, తను లేకుంటే కాంగ్రెస్ పార్టీకి పుట్ట గతు లుండవన్నట్లు మాట్లాడడం చూసేవారికి రోతగా వుంది. కాంగ్రెస్ పార్టీ ఒక సజీవ స్రవంతి; ఒక మహా ప్రవాహం. ఒకరిద్దరు వ్యక్తుల రాకపోకలతో దానికి నష్టం కలుగుతుందను కోవడం, పిల్లి ఉట్టిని శాపనార్థాలు పెట్టడమే అవుతుంది. అంకయ్య గౌడ్ నిన్నటి వరకు చేసింది సంఘవిద్రోహ వ్యాపారం. వృద్ధనారీ పతివ్రత అన్నట్లు, నిషేధం తర్వాత ఆయనిప్పుడు తనను పవిత్రుడుగా ప్రకటించు కోవచ్చు. అంత మాత్రాన నిన్నటి పాపం చెరిగిపోదు. గౌడ్ వంటి వారికి అంత ఆవేశం పనికి రాదు. తమ స్థాయి, తమ అర్హతలు తెలుసుకొని ప్రవర్తించడం అందరికి మంచిది.

### గురుమూర్తి రెడ్డి బదలీ

నెల్లూరు విద్యుత్ శాఖ ఛీఫ్ ఇంజనీరు శ్రీ గురుమూర్తి రెడ్డిని కడపకు బదలీ చేశారు; హైదరాబాదుకు చెందిన శ్రీ రాఘవేంద్ర రావును ఇక్కడ నియమించారు.

కడప పరిధిలో కర్నూలు వుంది; పిఎం, సిఎం స్వంత నియోజక వర్గాల విద్యుత్ పనులు సమర్థవంతంగా జరిపించాలనే ఉద్దేశ్యంతో గురుమూర్తి రెడ్డిని అక్కడకు పంపినట్లున్నారు - ఛైర్మెన్ బలరామ రెడ్డి. కాని, స్వంత జిల్లాను వదలి పెట్టి, పరాయి జిల్లాల సంక్షేమం చూడడం బాగుందాండీ - బలరామ రెడ్డి గారూ?

గురుమూర్తి రెడ్డి గారు ఎక్కడున్నా సంస్థకు, తనకు మంచి పేరు తేగల సమర్థులు.

### వైశ్య సమ్మేళనం

నెల్లూరు జిల్లా ఆర్యవైశ్య సమ్మేళనం జనవరి 2 తేది టౌన్‌హాల్‌లో జరుగనున్నది. జిల్లా ఆర్యవైశ్య సంఘం అధ్యక్షుడు శ్రీ చిదెళ్ల వెంకటేశ్వర్లు వైశ్యులలో చైతన్యం తేవడానికి ఈ కార్యక్రమం తలపెట్టారు.

### జనార్దన రెడ్డి

(7 పేజీ కొరవ)

కేంద్రంలో ముగ్గురు ఆంధ్ర మంత్రులున్నప్పటికీ, రాష్ట్రంలో పార్టీ మెరుగుదలకు తోడ్పడ గల్గిన వారు ఒక్కరూ లేరు. ఎన్నికల సమయంలో ఇది పెద్ద లోపంగా కన్పిస్తూంది. విజయ భాస్కర రెడ్డికి వ్యవస్థాపరంగా, ఆర్థికంగా తోడ్పాటు ఇవ్వగల సమర్థత, కాలినడకలో కూడా సరకాన్ని దాశవశ్యం వున్న నాయకుడు ఆంధ్రలో జనార్దన రెడ్డి ఒక్కరుగానే కన్పిస్తున్నారు. అందువల్ల ఆయనకు అవకాశం గ్యారంటీ అన్న అభిప్రాయం ఏర్పడుతూంది.

## జిల్లా వార్తలు

(5 పేజీ కొరవ)

మర్చిపోయారు. ఇంజనీర్లు కూడ కాంట్రాక్టరేను పల్లెత్తు మాట అనక, అతనితో జతకలిశారు. పూర్తి చేయవలసిన 4 కిలోమీటర్ల నిడివిరోడ్డు అధ్వాన్నంగా వుండి తలపిస్తున్నది. రోడ్డు వేయిందుకొంటే ఆర్టీసి బస్ వేస్తామని అధికారులు చెప్పారట. రోడ్డు పని పూర్తి చేయించమని పంచాయతీరాజ్ శాఖ ఆఫీసుల చుట్టూ తోరపల్లి వాసులు తిరగడమే కాని స్పందించిన అధికారి లేడు.



ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము

## రెవిన్యూశాఖ - కావలి డివిజన్

సూచిక. నం./ /93 రెవిన్యూ డివిజనల్ శాఖాధికారి కార్యాలయము, కావలి

యిందు మూలముగా యావన్మందికి తెలియజేయడమేమనగా ఉదయగిరి మండలం పుల్లాయపల్లిగ్రామ సర్వే నం. 100 లో మరియు 106 లలోని య300-00ల భూమిలో ఉన్నచెట్లు భూమి మట్టము వరకు కొట్టుకొని పోవుటకుగాను తే10-1-94 ది ఉదయం గం.11.00 లకు కావలి రెవిన్యూ డివిజనల్ అధికారి గారి కార్యాలయములో బహిరంగముగా వేలము వేయబడును. ఈ వేలం పాటలో పాల్గొన కోరువారు యీ క్రింది షరతులకు లోనై పాటలో పాల్గొన వలయును.

### షరతులు

1. వేలము రోజున ఉదయం గం. 9.00 లకు తే 10-1-94 ది ఇ.యం.డి. (ధరావత్తు) క్రింద పాటపాడు వ్యక్తి రు 5000/.లు (అయిదు వేల రూపాయలు చెల్లించవలెను.
2. హెచ్చు పాటదారుడు మొత్తము డబ్బులో ధరావత్తు మినహాయించి మిగతా వున్న మొత్తమును రెండు వారాలలో చెల్లించి తగువైన రశీదు పొందవలయును.
3. హెచ్చు పాటదారుడు కాయపు ఉత్తర్వులు అందిన 30 దినములలోగా చెట్లు నరుకుడు పూర్తి చేసి సదరు కలపను ఆ స్థలము నుండి తొలగించ వలెను. ఈ విషయములో 30 దినములకుపైగా కాలము పొడిగింప బడదు.
4. హెచ్చు పాటదారుడు మిగతా మొత్తమును రెండు వారములలోగా చెల్లించవలెను. మొదటి వారములో కట్టవలసిన వాటా మొత్తము కట్టిన మీదటనే సదరు కలపను తీసికొని పోవలెను. రెండవ వారము పూర్తి మొత్తమును కట్టిన మీదటనే పూర్తిగా కలపను తీసికొని పోబడును.

పై నిబంధనలకు హెచ్చు పాటదారుడు అతిక్రమించిన యెడల ప్రభుత్వపరంగా చట్టరీత్యా చర్య తీసుకొనబడును.

యు. వాణీ శంకర్
రెవిన్యూ డివిజనల్ ఆఫీసరుగారు, కావలి.

ప్రభుత్వము వారి అనుమతి పొందిన



**Bhoomi**
**Engines Private Limited**
B-6 I.D.A. Uppal, Hyderabad - 500 039. Tel : 851644, 2

# భూమి పవర్ టిల్లర్
(Water Coold)

చైనా నుండి ఇంపోర్టెడ్

* **7 H.P.** భూమి పవర్ టిల్లర్‌తో దున్నేప్పుడు మనిషి కూడా నడువ వలయును.
* **11 H.P.** భూమి పవర్ టిల్లర్‌తో దున్నేప్పుడు మనిషి కూర్చొని నడువవచ్చు.




## సన్నకారు - మధ్య తరగతి రైతులకు నిరుద్యోగులకు అపూర్వ వరం

లక్షలు పోసి ట్రాక్టర్ కొనబల్లేదు. చిన్న రైతులకు అందుబాటైన ధర దీనికి అమర్చిన 250 సార్లు తిరిగే 18 బ్లేడులు గల రోటావేటర్‌తో రొంపి దుక్కి - మీకు మూడు నాలుగు సాళ్ల ట్రాక్టరుతో దున్నిన దాని కంటే మంచి దుక్కినిచ్చును. మాను తోలనవసరం లేదు. తుంగ ఇతర కలుపు నూటికి నూరు పాళ్ల అరికట్ట వచ్చును.

2 లీటర్లు డీజల్‌తో ఒక ఎకరం దుక్కి దున్నవచ్చు.

4'' x 4 '' పంపుతో నీళ్ళు తోడవచ్చు. బోదులు, కాలువలు చేయవచ్చు. చెరకు రసం తీయవచ్చు. క్రిమి సంహారకర మందులు చల్లవచ్చు. అతి తక్కువ ఖర్చుతో ఎరువు తోలవచ్చు - వరి కోయ వచ్చును - నూర్చవచ్చు. ఇన్నెందుకు రైతుకు వలయు అన్ని పనులు చేసుకోవచ్చు.

లీటర్‌కు - **25** కి. మీ దూరం పోవును

— పంచాయితీలకు — మున్సిపాలిటీలకు
— నిరుద్యోగులకు భవతి కల్పించగలదు.
— చిన్న చిన్న వీధులలో కూడా తిరిగి చెత్త తోలేందుకు అనువైనది.

రవాణాలో **25** కి.మీ. స్పీడు

**7 H.P.** రెండు, **11 H.P.** మూడు టన్నులు లోడ్ అవలీలగా లాగును.





మెట్టపొలాలకు ఎల్లుకిక్కి ఎత్తినది. తొమ్మిదంగుళాలు లోతుగా పాట్ల - ఎరువును బాగుగా కలిపి దున్నును. విత్తనం వేయవచ్చును. కలుపు తీయవచ్చు. బోదులు చేయవచ్చు. నీరు కట్టవచ్చు. రైతుకు అన్ని వ్యవసాయ పనులు చేయును.

**మా వద్ద ఇంకనూ:**

మహావీర్ స్ప్రింక్లర్లు; డీజెల్ జెనరేటర్లు; సబ్. మెర్సిబుల్ మోటర్ పంప్ సెట్లు; మోనోబ్లాకులు, కప్లింగ్ మోటార్ పంపు సెట్లు, ఆయల్ ఇంజన్లు, అన్ని రకాలు గృహోపకరణములు, ఇండస్ట్రియల్ మిషనరీ లభించును.

కంపెనీ ట్రైనింగ్ పొందిన నిపుణులైన మెకానిక్‌లచే రిపేరు సర్వీసు చేయబడును.

# స్వస్తిక్ ఆ ఇండస్ట్రియల్ సేల్స్ అండ్ సర్వీస్

15/794, జేమ్స్‌గార్డన్, నెల్లూరు - 524 002. ఫోన్: 26880

# శివారెడ్డి పద్యాలు

**ప్రధానమంత్రి**

ఆశయుస్తె వాలు ఆ రోజా జారిక
పైకి బంపుతారు పదవులిచ్చి
అయిపోయింది టైము, అధికార మెప్పైన
రయచెయింది కవికి దర్శమింతి!

**వృద్ధాప్యము**

ఆతనియ్య నాక తలకాస్త వెరిపోక
బయట రావిలంపె బాధ సిగ్గు
నాకె గారు రేపు నేసైన యింతేర
నవ్వులాట పెచ్చు నడుత జరుగు!

**డాక్టరు నరసింహం** (.......)

మందు మాకు లిచ్చు మర్యాదజేస్తారు
సాగనంపుతారు, సత్కరీదు
మక్కకాఫీ యూరు కష్మర్తి కవిగార్లి
అదరీదు, దాలు అవె పదేలు!

## సణుగుడు

(4 పేజీ కొరవ)

నవాణా మంత్రి శ్రీఎం.వి. మైసూరా రెడ్డికి కడపలో సారా కింగ్‌గా పేరుంది. గత సంవత్సరం సారా వ్యతిరేక ఉద్యమం కీలక దశలో, మహిళలు సారా వేలం పాటలను విరోధిస్తు న్నప్పుడు కడప నుంచి మైసూరా రెడ్డి అనుచరులు తుపాకులతో నెల్లూరు వచ్చి ఆర్ అండ్ బి గెస్ట్‌హౌస్‌లో దిగి దౌర్జన్యంగా పాటలు పాడడానికి ప్రయత్నించారు. కాని ఆడవాళ్ల వీరావేశం ముందు వారి తుపాకులు పేలలేదు. మైసూరా రెడ్డి అనుచరుల బట్టీల నుంచే ఈ రోజుకీ ఉదయగిరి, వింజమూరు ప్రాంతాలకు లారీలకు లారీల సారాయి వస్తూనే వుందంటున్నారు.

మరొక మంత్రి శ్రీమతి మాగుంట పరలక్ష్మి సారా కాంట్రాక్టర్ల కుటుంబం నుంచి వచ్చినావిడే. స్వర్గీయ మాగుంట రవీంద్రనాథ చౌదరి కోస్తా జిల్లాల్లో కెల్లా అతి పెద్ద సారా సిండికేట్ చక్రవర్తిగా పేరు సంపాదించారు.

ఇటీవలే ఉద్యానవనకు గురైన అనంతపురం నాయకుడు శ్రీ జె.సి. దివాకర రెడ్డి సారా వ్యాపార కథ కమామిషు నిత్యం మనం పత్రికలలో చదువుతూనే వున్నాం. తెలంగాణా లోనూ రాజకీయ పెత్తనమంతా సారా వ్యాపారులదే. వారూ ఎమ్మెల్యేలుగా, ఎమ్పీలుగా, మంత్రులుగా చలామణీ అవుతున్నారు.

ఈ పరిస్థితులలో కల్తీసారా నిరోధానికి ఎన్ని చట్టాలు చేసినా, అవెంత కఠినంగా రూపొందించినా ప్రయోజనమేమిటి? వాటిని ఎవరు అమలు చేస్తారు? మంత్రికి సంబంధించిన నాటు సారా బట్టీల పైన దాడి చేసే దమ్ము ఏ ఎక్సైజ్ అధికారికి వుంటుంది? మంత్రిగారి నుంచి ఫోన్ వస్తే దొంగ సారా వ్యాన్‌ను నిలిపి పరీక్షించే సాహసం ఏ చెక్ పోస్టు అధికారికి వుంటుంది? మరి గట్టిగా సారాను పట్టిస్తే రేపటి ఎన్నికల్లో నిధులు ఇచ్చేదెవరు? ముఖ్యమంత్రి చట్టాలకు పదును పెట్టి అందర్నీ భయపెట్టాలను కుంటున్నారు; ఆ స్పీడు చూస్తే - సారా సొమ్ము తిని మరిగిన ప్రతి మంత్రికి ముఖ్యమంత్రి తన పైనే కక్షగట్టి ప్రవర్తిస్తున్నా దన్పించడంలో వింతేమీ లేదు కదా?

చట్టాల వల్ల సారా కుళ్లు రాజకీయాన్ని వదలి పోదు; పార్టీలన్నీ చిత్తశుద్ధితో ఒక నిర్ణయానికి వచ్చి, సారా వ్యాపారంతో ప్రత్యక్షంగా గాని, పరోక్షంగా గాని సంబంధం కల్గిన నాయకు లెవరకీ టిక్కెట్లు, పదవులు



మా తండ్రి

## నెల్లూరు రమణారెడ్డి గారు

26.12.93 తేది స్వర్గస్థులైనారు. వారి ఆత్మశాంతికై భగవంతుని ప్రార్థిస్తున్నాము.

వారి ఉత్తరక్రియలు

7.1.94 శుక్రవారం - చిలుపు

8.1.94 శనివారం - పెద్ద కర్మ

పల్లెపాడు గ్రామంలో మా స్వగృహమున జరుగును. బంధుమిత్రులు తెలియ గోరుతాము.

నెల్లూరు శ్రీనివాసులు రెడ్డి, P.A.O. Office - T.G.P. Project

నెల్లూరు రవీంద్రరెడ్డి, సర్పంచ్, పల్లెపాడు

అప్పగించవని తీర్మానించు కుంటే తప్ప ప్రజలు కూడా సారా వ్యాపారులను, ప్రజాధన దోపిడీ దారులను బ్యాలెట్ పెట్టెల్లో ఉరితీసి ఓడిస్తే తప్ప ఈ పురిటి కంపు వీడ్చ వచ్చినా పోదు.

## మజ్జి

(4 పేజీ కొరవ)

సరస్సుగా మారిపోయిందని. ఎం.పి. ఉపాధి సద్భక్తి విమర్శించారు. ఆయన సోదరులు వివేకానంద రెడ్డి, రామనారాయణ రెడ్డి కూడా పాల్గొన్నారు.

## సైన్స్ సెంటర్

(2 పేజీ కొరవ)

రామచంద్రరావు గారిని ఉలిక్కి పడేట్లు చేసింది. ఆయన తనంతట తానుగా వేదికెక్కి, తనను తాను పరిచయం చేసుకొని, తాము అమెరికాకు ధనార్జన కోసం పోలేదని, ఈ దేశంలో బ్రతకడానికి అవకాశాలు లేక వెళ్లామని తమ చదువులకు తగిన ఉద్యోగం కూడా ఈ దేశం తమకివ్వ లేదని, భారతదేశాన్ని కించపరుస్తూ మాట్లాడారు. అది సభికులలో ఉద్రిక్తత కల్గించింది. ఆనం వివేకానందరెడ్డి వెంటనే లేచి, ఈ దేశం మీకేమీ చేయలేదనడం అన్యాయం, ఈ దేశంలో చదివిన చదువే మిమ్మల్ని అమెరికాలో పైస్థానంలో నిలబెట్టింది; మిమ్మల్ని గౌరవించే స్థాయి ఈ దేశానికి లేనందువల్ల అక్కడకు వెళ్లామని అనవద్దు; ఇక్కడి కంటే అక్కడ ఎక్కువ డబ్బు సంపాదించ వచ్చుననే దృష్టితో వెళ్లడం తప్పేమీ కాదు; ఎక్కడ ఎంత వున్నత స్థానంలోవున్నా జన్మనిచ్చిన దేశాన్ని కించపరచడం తగదు అని ఆవేశంగా మాట్లాడేశారు. ఆ వాదోపవాదం మరింత పెరగకుండా తూపిలి సుందర రామిరెడ్డి గారు సర్దేశారు.

అమెరికాకు వెళ్లినంత మాత్రాన, అక్కడ ఇక్కడి కంటే మెరుగైన జీవన స్థితిగతులు వున్నంత మాత్రాన భారతదేశం దబ్బాదేశమనే దురభిప్రాయం మనవారిలో కల్గడం దురదృష్టకరం.

## జనవాణి

(3 పేజీ కొరవ)

వద్దనడం, అజ్ఞానంలోకి అడుగు పెట్టడమే.

నెల్లూరు -డా. ఇ.రాజగోపాల రెడ్డి

### ఆంధ్రాబ్యాంకు దోపిడి

నెల్లూరు టౌన్ మూలపేట ఆంధ్రాబ్యాంకు మధ్యాహ్నం సర్వీసు పేర ప్రజలను దోచుకొంటున్నది. మిగతా బ్యాంకులలో మధ్యాహ్నం రెండు గంటల లోపల డి.డి.లు తీసుకోలేని వారు ఇక్కడకు వెళితే రెట్టింపు ఛార్జి వసూలు చేస్తున్నారు. మద్రాసుకు 25 వేల రూపాయల డి.డి. ని కావాలని అడిగితే 105 రూ కమీషన్ చెల్లించ మన్నారు. పగటి పూటైతే రు. 52 లు మాత్రమే. ఈ మొత్తంతో ఏకంగా మద్రాసుకే పోయిరావచ్చు. బ్యాంకు మేనేజర్‌ను అడిగితే తాముండే బిజీవల్ల డబుల్

ఛార్జి వసూలు చేస్తున్నామని సమాధానం చెప్పారు. రిజర్వు బ్యాంకు నిబంధనల ప్రకారమే ఈ పనిచేస్తున్నారా? దీనికి బ్లాకులో సినిమా టిక్కెట్లు అమ్మడానికి తేడా ఏముంది? జాతీయం చేసిన బ్యాంకుల్లో జరిగే ఈ దోపిడిని అరికట్టేవారు లేరా?

నెల్లూరు - భవానీశంకర్

### రంగడికి పూర్వవైభవం

ఈ సంవత్సరం శ్రీ రంగనాయకుల స్వామి ద్వార దర్శనం మహోత్సవం కన్నులపండుగగా జరిగి ఎంతో ఆహ్లాదాన్ని ఇచ్చింది. గత పదేళ్లుగా ఇంతమంది భక్తులను ముక్కోటి ఏకాదశినాడు ద్వార దర్శనమపుడు చూడలేదు. ఏర్పాట్లలో కొద్దిపాటి లోటుపాట్లున్నా స్వామిదర్శనం బాగా జరిగింది. ఇప్పటి తరం వారికి ద్వారదర్శనం ప్రాముఖ్యత అంతగా తెలియదు. పాలకవర్గ అధికారులుగా వున్నవారు ఈ విషయంలో కొంత ప్రచారం చేసివుంటే బాగుండేది. ఇటీవల వుత్సవాల నిర్వహణ తీరుచూస్తుంటే బ్రహ్మోత్సవాలు కూడా చక్కగా చేస్తారన్న నమ్మకం కలుగుతూంది. రంగడికి పూర్వ వైభవం తెచ్చి, వైష్ణవ మతాచార్యులైన శ్రీరామనుజా చార్యుల వారి జయంతి కూడా జరిపిస్తే బాగుంటుంది.

తడ. - విస్సా రామచంద్రరావు

## పంచాంగము

1 తేది శనివారం ఆంగ్ల సంవత్సరాది.

### జనవరి తిథులు

మార్గశిర బహుళ

| | | | |
|---|---|---|---|
| తే1 | శని చతుర్థి | రా.గ. | 1.20 వ |
| తే2 | ఆది పంచమి | రా.గ. | 11.35 వ |
| తే3 | సోమ షష్ఠి | రా.గ. | 9.35 వ |
| తే4 | మంగళ సప్తమి | రా.గ. | 7.20 వ |
| తే5 | బుధ అష్టమి | సా.గ. | 5.00 వ |
| తే6 | గురు నవమి | సా.గ. | 2.40 వ |
| తే7 | శుక్ర దశమి | ప.గ. | 12.20 వ |

స్వయంపాకుల శ్రీనివాసులు

ఎం.ఎ

**జమీన్‌రైతు**

సంవత్సర చందా రూ. 100/-

అర్ధ సంవత్సర చందా రూ. 50/-

విడిప్రతి రూ. 2.00

# కుంతీపుత్రుడు

## చూడలేము బాబోయ్!

''కుంతీపుత్రుడు'' వంటి సినిమాలను ఏ దర్శకుడు తయారుచేసినా ఆ నిర్మాతలు నెత్తిన కొంగేసుకుని పోవలసిందే. బ్రేక్ డాన్సులు, ఫైటింగ్‌లు, ఫైట్లు సటనే కాదని. అందువల్ల వాటిని ఇమిడ్చి సినిమాలు తియ్యటం తనకు సుతరామూ గిట్టదన్న గట్టి నమ్మకం గల దర్శకుడు దాసరి నారాయణరావు. ఇదీ ఒక విధంగా ఈనాటి సినిమా పోకడలపై. వ్యంగ్య విమర్శ అని చెప్పొచ్చు. ఫైట్లు వగైరాలు మాని మంచి కుటుంబ కథా సినిమాలు నిర్మించవచ్చు కదా! అలాంటి చిత్రాలు తీసి గెలవాలంటే దర్శకునికి బుద్ధిబలం వుండాలి. అదిలేనివాడు

### గ్రిద్దలూరు గోపాలరావు

'కుంతీపుత్రుడు' చిత్రంలాగా చతికిల బడతాయి.

ఒక మళయాళ చిత్ర కథకు కత్తిరింపులు చేసి అతుకులు వేసి ''కుంతీపుత్రుడు'' చిత్రం కథ అల్లారు. సంగీతం మానసిక రోగాలపైన, శరీరపుగాయాలపైన పనిచేసి మనిషిని ఆయురారోగ్యాలతో అలరిస్తుందని విన్నాము. కన్నాము. చిత్రంలో ఆరోగ్యానికి నాట్యంతో చికిత్స చేశారు దర్శకుడు దాసరి, నిర్మాత మోహనబాబులు.

ఈ కథాసామగ్రి చాలా పాతది. ''కుంతీపుత్రుడు'' చతికిల పడ్డందుకు మొదటి కారణం యిదే. బ్రేకులు, ఫైట్లు లేని చిత్రాలకు కథాబలం అయినా వుండాలి. చికిత్సా విధానానికి ఉపయోగించిన నాట్యం. మితిమీరిన మోతాదు కావటం కూడా ఒక కారణం. కథా గమనంలో ఊపులేకపోవటం. సన్నివేశాలలో పట్టులేకపోవటం. పరచూరి బ్రదర్సు మాటల్లో పసలేకపోవటం. నాట్యమనే వైద్యంతో మనిషి ఆరోగ్యం కుదటపడ్డట్టు చూపిన దర్శకుడు నాట్యశాస్త్రంతో చిత్రానికి పౌష్టికాహారం సమకూర్చలేకపోవటం. దర్శకత్వంలో మెళకువలు, చెమక్కులు లేకపోవటం. మోహనబాబు, విజయశాంతి, సత్యనారాయణ, జగ్గయ్య, వేలు, బ్రహ్మానందం, బాబూమోహన్, వై.విజయ తదితర హేమాహేమీ నటీనటులు వారి నటనా ప్రతిభతో చిత్రం బలహీనత పోగొట్టలేకపోవటం. ఏ అంశమూ కొత్తగా కనబడకపోవటం కూడా కుంతీపుత్రుణ్ణి నేల కూలదీశాయి.

ఏదైనా కాస్త కొల్లిద్పుకుంటూ చిత్రం నడక సాగించిందీ అంటే అది ఇళయరాజా సంగీతం, జాలాది,

కొరవ 13 పేజీలో



తిక్కవరపు సుబ్బరామరెడ్డి గారు తీయబోతున్న స్వామివివేకానంద ముహూర్తపు షాట్‌లో టిఎస్ఆర్, దర్శకుడు అయ్యర్, వివేకానంద పాత్రధారి, ముఖ్యమంత్రి కోట్ల విజయభాస్కరరెడ్డి, ఎంఎస్‌రెడ్డి.

### చిరంజీవికి ఎదురుదెబ్బలు; రమ్యకృష్ణకు రొమాంటిక్ కెరీర్

# నాగార్జునే నంబర్ వన్!

జి

ఇది వరకెన్నడూ ఎదుర్కో నటు వంటి సమస్యలను తెలుగు సినిమా రంగం 1993 లో ఎదుర్కో వలసి వచ్చింది. నటీనటులు, సాంకేతిక నిపుణులు, ఫైనాన్షియర్స్ తప్ప నిర్మాతలు, కొనుగోలు దారులు అంత సంతోషంగా లేరు. దాదాపు 160 కోట్ల మూల ధనం సినిమాల నిర్మాణానికి వెచ్చింపబడితే, 140 కోట్లరూపాయల వరకు నష్టం వాటిల్లినట్లు అంచనా; పిచ్చోడి చేతిలో రాయిలా ఉంది తెలుగు చిత్ర పరిశ్రమ. ఆ రాయికి పండయినా రాలొచ్చు; తలయినా పగలవచ్చు. ఒక చిత్రంతోనే అత్యధిక లాభాలు సంపాదించాలనే ఆత్యాశతోనే చాలా మంది కొత్త నిర్మాతలు ప్రవేశించారు. వీళ్ల అనుభవలేమి వల్లే చిత్ర నిర్మాణ వ్యయం విపరీతంగా పెరిగి పోయింది. పెద్ద తారలున్న ఫైయిట్ చిత్రాలకే ఆదరణ ఉంటుందన్న అభిప్రాయం వమ్ము అయ్యింది. అంతర్లీనంగా చక్కని సందేశం ఉండే వినూత్నమైన చిత్రం డబ్బింగ్ అయినా కనకవర్షం కురుస్తుందని జెంటల్‌మేన్ చిత్రం నిరూపించింది. కొందరి సలహాలు వేదవాక్కులుగా ప్రభుత్వం పరిగణించడం వల్లే సినిమా రంగం విషయంలో తప్పటడుగులు వేయటం జరుగుతోందన్న విషయం సర్వత్రా వినిపిస్తోంది. అవినీతి పరులైన అధికారులకూ, అనధికారులకూ, పై పెత్తనం చెలాయించే ప్రభుత్వ యంత్రాంగానికే సబ్సిడీలు, రాయితీలు బంగారు గుడ్లు పెట్టే బాతులయ్యాయని చాలా మంది అనడంలో నిజం అంతో ఇంతో లేక పోలేదని కూడా తేటతెల్లమైంది. వ్యవసాయానికి అత్యావశ్యకమైన ఎరువులకు రాయితీలు తీసేసి, కోట్లతో రీళ్లు చుట్టేసే సినిమాలకు రాయితీలు, సబ్సిడీలు ఏమిటనే విమర్శ ఇటీవల తీవ్ర రూపం దాలుస్తోంది.

ఏది ఎలా వున్నా 1994 సుభిక్షంగా ఉంటుందని ఎదురుచూడ్డం కన్నా ఎవరు చేయగలిగిందేమీ లేదు.

### 'టాప్ ఛేర్' పై నాగార్జున!

93లో విడుదలైన అగ్రహీరోల తెలుగు చిత్రాలలో నటించిన మూడు చిత్రాలూ హిట్టయి అక్కినేని నాగార్జున 'టాప్ ఛేర్' అధిష్టించారు. ఆయన

**1993 లో తారల తీరు తెన్నులు**

నటించిన రక్షణ, వారసుడు, అల్లరి అల్లుడు ఈ సంవత్సరం విజయం సాధించాయి. కొత్త సంవత్సరంలో సంక్రాంతి పర్వదినాన నాగార్జున, శ్రీదేవి, రాంగోపాల్‌వర్మ కాంబినేషన్‌లో తయారైన గోవిందా.... గోవింద చిత్రం విడుదల వుతున్నది. ఈ చిత్రంపై అందరి కళ్లున్నాయి. ఇది మరో అంతమైతే మాత్రం నాగార్జున ప్రథమార్థంలోనే పలుగు దెబ్బతింటాడు.

భారత సినీపరిశ్రమలోనే అత్యధిక పారితోషికం అందుకొనే నటుడుగా కీర్తి గడించిన చిరంజీవికి ఈ సంవత్సరం సూపర్ డ్యూపర్ హిట్ ఏమీ లేకుండా పోయింది. ఆయన నటించిన ముఠామేస్త్రి, మెకానిక్ అల్లుడు ఆశించినంత విజయం సాధించలేక పోయాయి. సంక్రాంతికి విడుదలవుతున్న ముగ్గురు మొనగాళ్లు చిత్రం గత సంవత్సరపు కరువంతా తీరుస్తుందన్న ఆశలో ఆయన అభిమానులున్నారు. యువరత్న బాలకృష్ణకు ఈ సంవత్సరం ప్రథమార్థంలోనే 'అశ్వమేధం'తో ఎదురు దెబ్బ తగిలినా తరువాత వచ్చిన నిప్పురవ్వ, బంగారు బుల్లోడు 'స్టారడమ్' పోకుండా కాపాడాయి. ఈ సారి సంక్రాంతి రేస్‌లో ఆయన చిత్రం లేనట్లుంది. రీమేక్ హీరోగా పేరు గడించిన వెంకటేష్ నటించిన కొండపల్లి రాజా, అబ్బాయిగారు చిత్రాలు ఆయన ఆశలను నిరాశ పరిచాయి. ఈ సంవత్సరం అదృష్టవంతు డనతగిన వాడు మోహన్‌బాబు; దొంగ-పోలీస్, చిట్టెమ్మ మొగుడు, రౌడీమొగుడు, కుంతీపుత్రుడు, ఫ్లాప్ జాబితాలోకి

కొరవ 13 పేజీలో

## నాలుగో కృష్ణుడు

( మొదటి పేజీ కొరవ)

నాయకుడైన వెంకటస్వామికి అవకాశం కల్పించాలని ఒక వాదం బయల్దేరింది. అయితే వెంకట స్వామి ఇందుకు సుముఖంగా లేరు. ఎన్నికలు పది పన్నెండు నెలలలో పెట్టుకొని రాష్ట్ర నాయకత్వం స్వీకరిస్తే ఆ ఒత్తిడి తట్టుకోలేమనే భయం ఒక వైపు; ఆరునెలల లోపల శాసన ఎన్నిక పెట్టుకుంటే రెంటికీ చెడ్డ రేవడి అయిపోతామన్న సందేహం ఒక వైపు ఆయన్ను బాధిస్తున్నట్టున్నాయి. అందువల్ల ఆయన బయట పడటం లేదు.

నాయకత్వం మార్పు అన్న ప్రస్తావనే కూడదని ఒక వర్గం ప్రతిఘటిస్తున్నది. విజయభాస్కర రెడ్డి కంటె ఉత్తముడైన ముఖ్యమంత్రి వేరొక రెవరున్నారన్నది వీరి వాదన. ఆయన పై అవినీతి ఆరోపణలు లేవు; పాలనా యంత్రాంగాన్ని నిర్వహించ గల సమర్థత వుంది; స్థాయి వుంది. ఎమ్మెల్యేలు ఆయన దగ్గరకు పోవడానికి భయపడుతుంటారు. ప్రజలలోని ఏ వర్గంతోనూ ఆయనకు పేచీ లేదు; వ్యతిరేక భావం లేదు. ఆయన పదవి స్వీకరించిన తర్వాత ఢిల్లీ నుంచి పలు పథకాలకు నిధులు వచ్చాయి. ప్రాజెక్టుల నిర్మాణం ప్రశాంతంగా జరిగి పోతున్నది. పార్టీలో కూడా క్రమశిక్షణ తప్పితే దండన తప్పదన్న భయం సృష్టించారు. ఇన్ని అనుకూలాలున్న ముఖ్యమంత్రిని వదలు కొని కొత్త సమస్య లెందుకు తెచ్చుకోవాలని పార్టీలోని అధిక సంఖ్యాక శాసన సభ్యులు భావిస్తున్నారు. నాలుగో కృష్ణుడితో 'పని లేకుండానే, మూడవ కృష్ణుడితోనే నాటకాన్ని ఎన్నికల వరకు లాగించేసి తెరదించాలన్నది వీరి కోరిక.

## జనార్దన రెడ్డితో వైఎస్ వర్గం రాజీ?

రాజధానిలో సంచలనం సృష్టించిన మరొక సంఘటన మాజీ ముఖ్యమంత్రి శ్రీ ఎన్. జనార్దన రెడ్డితో వైఎస్ వర్గం రాజీకి సిద్ధపడుతున్నదన్న వార్త. తూర్పు, పడమర లేకమైనట్లు కన్పడే ఈ విద్యూరమూ నిప్పు వుంటేనే వచ్చిన పొగ క్రింద పరిగణించాలి. రవీంద్ర రెడ్డికి షోకాజ్ నోటీసు ఇవ్వాలని సిఎల్‌పి సమావేశంలో తీర్మానం చేయడంతో వైఎస్ వర్గం, సిఎం శిబిరంతో సంఘర్షణకు కత్తులు నూరుతున్నది. జనార్దన రెడ్డితో అనవసర పేచీ పెట్టుకొని పొరపాటు చేశామని వారు బాధపడుతున్నారు. జనార్దన రెడ్డినే కొనసాగించి వుంటె తమకీ పరిస్థితి వచ్చేది కాదని, మునభాయన చిన్నదానికీ, పెద్ద దానికీ కూడా తాడు తెగేట్టు లాగి పారేస్తున్నాడని వారు బాధపడుతున్నారు. వైఎస్‌కు కుడి భుజమన దగిన ఎమ్మెల్యే శ్రీ వరదరాజులు రెడ్డి, జనార్దన రెడ్డికి సన్నిహితుడైన మాదాల జానకి రాం వద్దకు తొలి రాయబారం నడిపారు. అయితే ఆయన్ను జనార్దన రెడ్డితో సమావేశ పరచడానికి జానకి రాంకు వీలుకాలేదు. ఇంకొక ప్రక్క రవీంద్ర రెడ్డి, మంత్రి శ్రీ పి. జనార్దన రెడ్డిని కలిసి రాజీ ముచ్చట్లాడారట. జనార్దన రెడ్డి అప్పుడు ఢిల్లీలో వున్నారు. ఆయన హైదరాబాదుకు వచ్చిన తర్వాత వీరిలో ఎవరో ఒకరితో సంభాషించ వచ్చు.

రవీంద్ర రెడ్డికి షోకాజ్ నోటీసు వచ్చిన తర్వాత, సిఎం పై తిరుగుబాటు ప్రకటించాలని; అందుకు జనార్దనరెడ్డి సహకరిస్తే బాగుంటుందని వైఎస్ వర్గం ఆలోచన.

## పంచాయితీ ఎన్నికలు

( మొదటి పేజీ కొరవ)

ఏజెంట్ కూడా దొరకని పరిస్థితి ఏర్పడుతుందని శాసన సభ్యులు కలసి కట్టుగా వెళ్లి ముఖ్యమంత్రికి విన్నవించారు. కానీ ఆయన అందుకు సుముఖంగా లేనట్లు వినికిడి.

## 50 ఏళ్ళ క్రితం

3 పేజీ కొరవ

### నెల్లూరు ముచ్చట్లు

#### అధికార వర్గం

చూడడానికి సన్నగా వుంటాడు "లావు గల వానికంటెను భావింపగ నీతిపరుడు బలవంతుండౌ" నన్నాడు సుమతి.

సిఫార్సు వినడు, కొంగల వదలి పెట్టడు, దబ్బును చిరు చెంతాలకు చేరనివ్వడు.

వెరి స్ట్రిక్టు ఆఫీసరు.

"ఈ కలికాలంలో ఎవరయ్యా యింత పొగడ్తకు నోచుకున్న ఆ మహావ్యక్తి"?

కోవూరు పోలీసు సబ్ యిన్స్‌పెక్టర్.

"అంత మహానుభావు డయితే పరాయి వూరు నుండి దౌర్జన్యానికి ముదివర్తికి ఎత్తివస్తే ఆ వెరి స్ట్రిక్టు ఆఫీసరు ఏం చేశారండి?"

అట్లా అడుగు, పైన గూటం దిగ్రులేదు. అదే శ్రీనివాస రావే గన పైన వుంటే తెలిసేది.

"ఈ యుద్ధబాండ్లు వగయిరా గడిబిడిలో ఎవరైతే మాత్రం ఎట్లా స్ట్రిక్టు వుండగలరండి?"

ఆ మాట కాడ మాత్రం నోరు మూసుకొని వెళ్తున్నాను.

#### అవీ- యివీ

శ్రీ వేదం వెంకట్రాయ శాస్త్రి గారి వర్ధంతి మహోత్సవం జరిగి 22 తేదీన - ఆ రాత్రే వర్ధంతి నిధి సహాయార్థం ప్రతాప రుద్రీయ నాటక ప్రదర్శనం గూడా-

బారు అసోసియేషన్ యాజమాన్యాన అమంచర్ల కృష్ణరావు పంతుల వారి ఛాయా పట ఆవిష్కరణ మహోత్సవం 29 తేది సర్ అల్లాడి గారిచే జరుపబడెను. టీ గూడా-

- విమర్శకుడు








### ప్రకటన

నెల్లూరు టౌన్ వేదాయపాలెంలోని వెంకటరెడ్డి నగర్ కాపురస్తురాలు షేక్‌మొగల్ కాశింబీబీ తనయింటి స్థలముకు తూర్పు వైపు వున్న K.నాగభూషణమ్మతో లాలూచీపడి నాక్లయింటు R.వరలక్ష్మికిన్ని సదరు నాగభూషణమ్మకున్ను మధ్య నెల్లూరు IIIవ అదనపు డిస్ట్రిక్టు మునసబువారి కోర్టులో పెండింగులో వున్న O.S. 384/89 మరియు O.S. 394/89 రు దావాల షెడ్యూలు స్థలములో కొంత భాగమును తనదిగా చెప్పి విక్రయించుటకు ప్రయత్నం చేయుచున్నట్లు నాక్లయింటుకు తెలిసినది. పైదావాలు తీర్మానం అగువరకు సదరాస్తిని పూర్తిగా గాని కొంతభాగం గాని ఎవరైనా కొనుగోలుచేసినా అట్టి విక్రయములు చెల్లవు. కొనుగోలు దారుకు ఏలాటి హక్కు సంక్రమించదని యిందువల్ల యావన్మందికి తెలియజేయడమైనది.

యం.కె. శింగరాజు

29-12-93 అడ్వొకేటు, నెల్లూరు.



## నెల్లూరు సంగతులు

(4 పేజీ కొరవ)

పత్రికా యజమానులు తమ ప్రాపకం కోసం అనారోగ్య పోటీలు సృష్టించడం ద్వారా జర్నలిజపు విలువలు దిగజార్చుతున్నారని. సంచలన వార్తలతో ప్రజలను రెచ్చగొట్టడం దేశ సేవ అవుతుందా అని ప్రశ్నించారాయన. జర్నలిస్టులు ప్రభుత్వం ద్వారా సహాయం పొందాలంటే అనేక సానుకూలమైన మార్గాలున్నాయని. కాని భయపెట్టి సాధించు కోవాలనడం మంచిది కాదన్నారు. టౌన్‌లో ఐదు సెంట్ల భూమిని ప్రెస్ క్లబ్‌కు కేటాయిస్తానని వాగ్దానం చేశారు. ఇళ్ల మంత్రి శ్రీ పెంచలయ్య తన వుపన్యాసంలో ఒక మంత్రి మీదనో బాధ్యత గల ప్రజాప్రతినిధి మీదనో వార్తలు వ్రాసే ముందు విలేకరులు ఆత్మవిమర్శ చేసుకోవాలన్నారు. దారిన పోయే దానయ్యలు. బ్లాక్ మెయిలర్లు ఇచ్చే స్టేట్‌మెంట్లు వ్రాసి ప్రతికా వ్యవస్థ పరువు ప్రతిష్టలను బజారు పాలు చేయవద్దని విజ్ఞప్తి చేశారు. నెల్లూరు విలేకరుల ఇళ్ల స్థలాల విషయం పరిశీలిస్తానని చెప్పారు. శ్రీ జె.కె. రెడ్డి మాట్లాడుతూ. మీకు తప్పు ఎత్తి చూపే హక్కుంది; కాని అవాస్తవాలను వ్రాసి నవ్వుల పాలయ్యే పరిస్థితి తెచ్చుకోవద్దని పాత్రికేయులకు సలహా ఇచ్చారు. సారా నిషేధం పోరుపు. అక్షరాస్యత వుద్యమాల విజయ సారథులు విలేకర్లేనని జిల్లా కలెక్టర్ శ్రీ ఎం. సాంబశివ రావు కితాబిచ్చారు. మాజీ మంత్రి శ్రీ రామనారాయణ రెడ్డి గతంలో జిల్లాలోని జర్నలిస్టులకు గొప్ప గౌరవం వుండేదని. నేడు అది పోగొట్టు కొన్నారని సూటిగా చెప్పారు. ఆంధ్రజ్యోతి డిప్యూటీ ఎడిటర్, యూనియన్ జాతీయ కార్యవర్గ సభ్యులు శ్రీ జి. వుపేంద్ర బాబు జిల్లా ఎడిషన్లు వచ్చాక పత్రికా రంగంలో అనారోగ్య పోటీ ఏర్పడి తద్వారా విలేకర్లకు కొన్ని రుగ్మతలు అంటుకు పోయాయని. వీటి నుంచి విముక్తి చేయను యూనియన్ ప్రయత్నిస్తుందని చెప్పారు. యూనియన్ రాష్ట్ర కార్యదర్శి అంబటి ఆంజనేయులు జిల్లా కార్యదర్శి సిరాజ్ కూడా మాట్లాడారు.

జమీన్‌రైతు సహాయ సంపాదకుడు అల్లూరు రహీం ప్రవేశ పెట్టిన ఉత్తమ గ్రామీణ జర్నలిస్టుల అవార్డులను ఈ సంవత్సరం తడ ఈనాడు విలేకరి దుర్గాప్రసాద్, కోవూరు ఆంధ్రప్రభ విలేకరి కె. వెంకట సుబ్బయ్య, దక్కిలి ఉదయం విలేకరి రత్తయ్య గెల్చుకొన్నారు. విజేతలకు రోల్డ్ గోల్డ్ రిస్టు వాచీలు, ప్రశంసా పత్రాలను మంత్రులు నారసింహా రెడ్డి, పెంచలయ్య, కలెక్టర్ ఎం. సాంబశివ రావు అందించారు. శ్రీ ఆనం వివేకానంద రెడ్డి విలేకరులందరికీ విందు చేశారు.

### మంత్రిని కలిసిన ఐక్య కార్యాచరణ కమిటీ

26 తేదీ నెల్లూరు వచ్చిన రాష్ట్ర మునిసిపల్ శాఖామాత్యులు శ్రీ మాగాణి నారసింహా రెడ్డిని గెస్టుహౌస్‌లో [illegible] నూతన విధాన వ్యతిరేక ఐక్య కార్యాచరణ [illegible] రెడ్డి నాయకత్వాన కలిసింది. మునిసిపాలిటీలో కొత్తగా విధించిన ఇంటి పన్ను పెరుగుదల 25 శాతం మించకుండా చూడాలని. నీటి కొళాయిల పన్ను నెలకు 40 రూపాయల నుండి 20 రూ తగ్గించాలని మంత్రిని కోరారు. టౌన్‌లో వినోద పన్నుతో పాటు ప్రభుత్వ భవనాల పై పన్ను. అడ్వర్టైజ్‌మెంట్, మోటారు వాహనాల పన్ను. నూతన భవనాల పై పన్నులు విధించడం ద్వారా రాబడి పెంచుకోవచ్చని సలహా యిచ్చారు. మంత్రిని కలిసిన బృందంలో పున్నం బసవయ్య, ఎ.కోదండరామయ్య, ఎ. అనంత రామయ్య జీ భాస్కర రామరెడ్డి వున్నారు. కమిటీకి మంత్రి గారు ఎటువంటి హామీ ఇవ్వలేదు.

### హిందీ ప్రచారక మండలి సమావేశం

జిల్లా హిందీ ప్రచారక మండలి సర్వసభ్య సమావేశం 26 తేదీ సర్వోదయా కళాశాలలో మండలి ఉపాధ్యక్షులు బి. యల్లమందయ్య అధ్యక్షతన జరిగింది. రాష్ట్ర ప్రభుత్వ ఉత్తమ ఉపాధ్యాయ అవార్డు పొందిన శ్రీమతి జె. సామ్రాజ్య లక్ష్మిని సన్మానించారు. ఎ.పి. హిందీ ప్రచార మండలి ప్రధాన కార్యదర్శి జి. అంజయ్య ముఖ్యఅతిథిగా విచ్చేశారు. చివరన మండలి కార్యదర్శి ఎ. వెంకట సుబ్బయ్య వందనాలు చెప్పారు.

### ఎల్.ఐ.సి. వుద్యోగుల సంఘ సమావేశం

ఇన్సూరెన్స్ కార్పొరేషన్ ఎంప్లాయిస్ యూనియన్ నెల్లూరు డివిజన్ ప్రథమ వార్షిక మహాసభ 27 తేదీ ఎన్.జి.ఓ. హోమ్‌లో ఘనంగా జరిగింది. ఎ.ఐ.ఐ.యి.ఎ. జనరల్ సెక్రటరీ శ్రీ ఎన్. సుందరం ముఖ్యఅతిథిగా విచ్చేశారు. ప్రయివేటీకరణ పేరిట ప్రభుత్వ రంగ సంస్థలను విదేశీయులకు అప్పగించాలని చూస్తున్న ప్రభుత్వ విధానాలను ప్రతి ఒక్క కార్మికుడూ ఖండించాలన్నారు. సీనియర్ డివిజనల్ మేనేజరు శ్రీ సి.ఎస్. మాధవ రావు ఐ.సి.ఇ.యు. సంవత్సర కాలంలో సాధించిన విజయాలను వివరించారు. డివిజన్ వుద్యోగ సంఘం అధ్యక్షులు ఎ. నందీశ్వర్లు అధ్యక్షత జరిగిన సభకు టి. ప్రభాకర రావు వందనాలు చెప్పారు. అనంతరం నూతన కార్యవర్గం ఎన్నిక జరిగింది. అధ్యక్షునిగా పి.ఎల్. నారాయణ, కార్యదర్శిగా ఎ. నందీశ్వర్లు, కోశాధికారిగా టి.వి. రావు ఎన్నికయ్యారు.

### చిత్రసమీక్ష

(6 పేజీ కొరవ)

నారాయణరెడ్డి, రసరాజు, గురుచరణ్ వ్రాసిన పాటలు, జయరాం ఫోటోగ్రఫీ అందించిన చేయూతే కారణం. "లేలే బాబా నిద్దురలేవయ్యా" షిర్డీసాయి భక్తిగీతం బాలసుబ్రహ్మణ్యం తియ్యని గొంతులో, భక్తిభావం, ఆర్ద్రత సంతరించుకుంది. "ఒక హృదయము పలికిన సరిగమ స్వరము ఎవరాపినా ఆగని సంధ్యారాగము" పాటలో సాహిత్యపు విలువలు జేసుదాసు మధుశోకంతలో జీవం పోసుకున్నాయి. ఈ రెండు పాటలు వినదగినవి.

రాంబాబు (మోహనబాబు) బడా యువ జమీందారు, అహంకారి, పరమ మూర్ఖుడు. అతని మాటకు ఎదురులేదు. ఒక నాట్యకత్తెను (విజయశాంతి) గద్దికట్టి తన ఎదుట నాట్యం చెయ్యమని బలవంతం చేస్తాడు. ఆమె అతని మాటను ఎదిరించి వెళ్లిపోతుంది. అతను రెచ్చిపోతాడు. కొందరు దుండగులు కక్ష గట్టి రాంబాబును హత్య చేయబోతారు. ఆ కక్ష సాధింపు చర్యలో రాంబాబు తీవ్రంగా గాయపడతాడు. దెబ్బలనుండి కోలుకుంటున్న రాంబాబును మరలా చితకబాదుతారు. లేవలేని పరిస్థితి ఏర్పడుతుంది. ఇక తన ఆరోగ్యం బాగుపడదన్న నిర్ణయానికి వచ్చి ఆత్మహత్యకు పూనుకుంటాడు. అప్పుడు నాట్యకత్తె అడ్డుపడుతుంది. వైద్యశాస్త్రం చెయ్యలేని చికిత్స నాట్యశాస్త్రం చేసి ఆరోగ్యాన్ని బాగుపరుస్తుందన్న నమ్మకాన్ని అతనిలో కలిగిస్తుంది. తన నాట్యం ద్వారా రాంబాబుకు స్వస్థత చేకూరుస్తుంది. ఇదీ కథ.

### నాగార్జున

(11 పేజీ కొరవ)

వెళ్లినా, ఎన్టీఆర్‌తో కలసి నటించిన మేజర్ చంద్రకాంత్ సూపర్ డ్యూపర్ హిట్ అయ్యింది. రాజశేఖర్‌కు అల్లరిప్రియుడు వంటి పెద్దవిజయం అందితే సుమన్‌కు బావ-బావమర్ది, పరువు ప్రతిష్ట, రాజేంద్ర ప్రసాద్‌కు రాజేంద్రుడు-గజేంద్రుడు, మిస్టర్ పెళ్లాం వెనుక నిలిచాయి.

### హీరోయిన్లలో టాప్ రమ్యకృష్ణ

హీరోయిన్ రమ్యకృష్ణ గత సంవత్సరం వరకు ఐరన్‌లెగ్ హీరోయిన్‌గా పేరుగాంచింది. ఈ సంవత్సరం దర్శకుడు రాఘవేంద్రరావు ఇచ్చిన బ్రేక్‌తో 'గోల్డెన్ లెగ్' హీరోయిన్ అయ్యింది. ఆమె నటించిన అల్లరి ప్రియుడు, మేజర్ చంద్రకాంత్, బంగారు బుల్లోడు, అల్లరి అల్లుడు, హిందీ చిత్రం ఖల్‌నాయక్ విజయవంతమయ్యాయి. కానీ ఆమెకన్నా ఎక్కువ క్రేజ్‌ను తన వంపు సొంపులతో యువత హృదయాలను గిలిగింతలు పెట్టే నగ్మా కొట్టేసింది. ఆమె నటించిన వారసుడు, మేజర్‌చంద్రకాంత్, రెండిళ్ల పూజారి, అల్లరి అల్లుడు విజయవంతమై గ్లామర్ హీరోయిన్‌గా ఆమెకు తిరుగు లేదని నిరూపించాయి. లేడీ అమితాబ్‌గా ఒకప్పుడు పేరు గడించిన, విజయశాంతి ఈ సంవత్సరం పలు చిత్రాలలో నటించినా పోలీస్ లాకప్ ఒక్కటే విజయవంతమయ్యింది. ఆశయం అనుకొన్నంతగా ఆడలేదు. యువనటి మీనాకు ముఠామేస్త్రి, అల్లరి అల్లుడు విజయవంతమైన రేంజ్ నిచ్చాయి. రోజా తరచూ ప్రమాదాలలో గాయపడడంవల్ల ఎక్కువ చిత్రాల్లో నటించలేక పోయింది.

### సాటిలేని మేటిచిత్రం 'మాతృదేవోభవ'

ఈ సంవత్సరం విడుదలైన అన్ని చిత్రాల్లో సాటిలేని మేటి చిత్రంగా కె.ఎస్. ప్రకాశరావు తీసిన 'మాతృదేవో [illegible] పచ్చు. అసభ్యత, అశ్లీలత అణుమాత్రం కన్పించని మానవతా దృక్పథం గల మహోన్నత చిత్రంగా పలువురి ప్రశంసలు పొందిందని చెప్పవచ్చు. గత సంవత్సరం బంగారు నంది అవార్డులకు అర్హత నోచుకోని తెలుగు చిత్రం కొరత ఈ చిత్రం తప్పక తీరుస్తుంది. ఈ చిత్రం కథానాయిక మాధవి నటన ఆమె కెరీర్‌లో నభూతోనభవిష్యతి. సామాజిక స్పృహతో తీసిన చిత్రాలలో దండోరా విజయ వంతంగా యజ్ఞం విడుదలై ఒక యజ్ఞమయ్యింది. వినోదాత్మక విజయ [illegible] 'సుని' చిత్రాన్ని [illegible]

### జెంటిల్‌మన్ రికార్డు

ఏ తెలుగు స్ట్రయిట్ చిత్రం సాధించని విజయాన్ని డబ్బింగ్ చిత్రం 'జెంటిల్‌మన్' సాధించడానికి అందులోని పాటలు. కథనమే కారణమని నిస్సందేహంగా చెప్పవచ్చు. మణిరత్నం 'రోజా' ఆకోవ లోనిదే!

### పలువురికి పునర్జన్మ

వెంకటగిరి సమీపంలో నవంబర్ 15 తేది సంభవించిన విమాన ప్రమాదంలో బ్రతికి బట్ట కట్టడం పలువురు తెలుగు ప్రముఖులకు పునర్జన్మగా అభివర్ణించ వచ్చు.

### ఎన్టీఆర్...ఎన్టీఆరే!

విశ్వవిఖ్యాత నట [illegible] భౌమునిగా తన స్థాయిని [illegible] రామారావు నిలబెట్టుకొన్నారు. ఆయ నటించిన మేజర్ చంద్రకాం[illegible] సూ[illegible] డూపర్ హిట్. విభిన్న గెటప్పులకు తనకు ఎవరూసాటిరారని ఆ చిత్రంలో అల్లూరి సీతారామరాజు, కట్టబ్రహ్మన, సుభాష్ చంద్రబోస్ పాత్రల ద్వారా నిరూపించారు. 'శ్రీనాథ కవి సార్వభౌమ' చిత్రం ద్వారా చారిత్రాత్మక పాత్రపోషణలో తనకు ఎదురు లేరనిపించారు. కాని మరో సీనియర్ నటులు అక్కినేని నాగేశ్వర రావుకు చెప్పుకో తగ్గ హిట్ ఈ సంవత్సరం లేదు. కృష్ణ (వారసుడు, పచ్చని సంసారం), శోభన్‌బాబు (ఏవండి ఆవిడ వచ్చింది), కృష్ణంరాజు (బావ-బావమరిది) చిత్రాలు విజయవంత మయ్యాయి.

# ఉత్తరక్రియలు



మితభాషి, నిగర్వి, సహృదయుడు, మా తండ్రి

# గూడూరు వెంకట నారాయణ రెడ్డి గారు

చిన్నచెరుకూరు

24.12.93 తేది శుక్రవారం రాత్రి ముక్కోటి ఏకాదశి పర్వదినాన పరమపదించిరి.
వారి ఆత్మకు దైవ సన్నిధిన చిరశాంతి కలుగాలని ప్రార్థిస్తూ, వారి ఉత్తరక్రియలు

**8.1.1994 తేది శనివారం**

చిన్నచెరుకూరులో మా స్వగృహమున జరుగును. బంధుమిత్రులు తెలియ గోరుతాము

కుమారులు-కోడళ్లు గూడూరు వెంకటశివకుమార్‌రెడ్డి- అనిత
గూడూరు విజయభాస్కరరెడ్డి
గూడూరు వసంతకుమార్‌రెడ్డి-కృష్ణప్రియ

కుమార్తె- అల్లుడు పి. శీతాలక్ష్మి- విజయకుమార్‌రెడ్డి
కుమార్తె జి. వాసంతి

## గూడూరు సులోచనమ్మ- భార్య

మనుమలు- మనుమరాండ్రు

Edited, Printed and Published by N. Dolendra Prasad at Zaminryot Press. OFFSET Printing at Nayagara Paper Products (India)